శ్రీరస్తు.

# పీ ఠి క

(ఖిలాసహాపురం శ్రీభాష్యం కృష్ణమాచార్యులవారు.)

"శ్రీ వెల్లుట్ల శేషగిరిరావువ్రాసి ప్రకటించినది" అనుశీర్షికగల 'బహిష్కారఖండనాభాస'మ్మను కాగితము ఇపుడే చూడనయినది. ఈవిషయమై అవశ్యముగా దెల్పవలసిన ఒకటిరెండువిషయములను మాత్రమిపుడు తెల్పెద. ఈ శేషగిరిరావుగారు తన్ను హైకోర్టువకీలని ప్రచారముచేసుకొనియుండుటచే వీరు సరియయిన న్యాయవాదిగనే యుందురను విషయమున సంశయమేమాత్రము లేదు. కనుక వీరు మధ్యస్థదృష్టితో నాయీనివేదనంబును గమనించి యథార్థంబును గ్రహింతురని నమ్మెద. పరిష్కారబహిష్కార గ్రంథమున నొకయక్షరముకూడ నబద్ధముకాజాలదనియు నన్నియు సత్యమేయనియు ప్రమాణముచేయుదును. ఈరావుగారు తనయధికారమునకు దూరమైన యీవిషయమున ప్రవేశించి భాగవతాపచారమును ఆచార్యాపచారమును సంపాదించుకొనుట కొంచమయినను న్యాయముకాదు అనువిషయము మొట్టమొదట హితబుద్ధ్యా తెల్పెద. పై గ్రంథమునకు ప్రధానపాత్రమయిన వ్యక్తికి దంభుడనుపేరే జగత్ప్రసిద్ధముగానుండుటచే నాపేరితోనే యిచట వక్తవ్యాంశములను తెల్పెదము.

ఈదంభుని పితృపితామహుల ప్రసంగము బహిష్కార గ్రంథమున నత్యావశ్యకమేగాని అనావశ్యకముకాదు. పరమ

పవిత్రమైన సద్వంశమున బుట్టినవానికి నిట్టి యపథప్రవృత్తి న్యాయముగాదని లోకమంతయు చెప్పుచున్నదిగదా! *కథం దశరథాజ్జాతః భవేద్రాజ్యాపహారకః* అను శ్రీరామాయణ భరతవాక్యమున దశరథప్రస్తావముండు రీతిగనే యిదికూడన గును. "ఖిలాసహాపురం కృష్ణమాచార్యులెట్లు సాహసించిరో, దీనికి నేనత్యంత మాశ్చర్యపడుచున్నాను" అని వకీలుగారు వ్రాసిరి. మహామహోపండితసింహాములు విద్వత్కంఠీరవములు ప్రవేశించి పరిశీలించి సిద్ధాంతముచేసిన విషయమున నొకవి ద్యార్థి అనవసరముగ బ్రవేశించిచేయు స్వచ్ఛందప్రలాపము లనుగదా వీరు ఆశ్చర్యపడవలయును, నిర్వేదపడవలయును. అయ్యో! అది యణుమాత్రము లేదే? నావిషయమున వీరికి ఆశ్చర్యపడవలసిన కారణము కొంచమైనను లేదే. 'సెబాష్, ఆనందము, పరమానందము ఇత్యాదివచనములు మనరావు గారికి సొంతములుగావు. అన్యదీయములు అను తత్వము నందఱు నెఱుంగుదురు.

కీర్తిమూర్తులైన శ్రీనివాసవరదాచార్యులయ్యవార్లం గారను మోటూరుస్వాములు పరమపవిత్రచరిత్రులు, సదా నుసంధేయ దివ్యగుణగణార్ణవులు, సుప్రభాతస్మరణీయదివ్య కీర్తులు. వారికీర్తిరాశికి ఈదంభుడు కళంకముచేయుచున్నాడే గాని మేము కృతజ్ఞతాసీమలోనే సంచరించుచున్నాము. ఆ మహనీయులకాచార్యపుంస్త్వమును ఏమాత్రమును అపలపిం పలేము. శ్రీమాన్ శ్రీరంగాచార్యస్వాములు మున్నగువారు పెద్దఆచార్యపురుషులుగా నేయుండినను వారందఱు నీస్వామి ప్రభావంబునుజూచి ఆచార్యప్రతిపత్తివహించినారనిన నిందె

వరికిని ఆక్షేపలేశముకూడ లేదే. అటులే యీస్వాములుకూడ స్వయముగనే పెద్దఆచార్యపురుషులుగానుండియు కంచిస్వాములప్రభావంబునుచూచి వారివద్దనాచార్యప్రతిపత్తి వహించినారనిన నాక్షేపమేమి? శ్రీశ్రీరంగాచార్యస్వాములు మున్నగువారు మనపెద్దస్వాములయొద్ద పంచసంస్కారము నొందలేదే. గ్రంథకాలక్షేపముచేయలేదే. అటులే వీరుకూడ కంచిస్వాములయొద్ద పంచసంస్కారములనొందకయే ఆచార్యప్రతిపత్తివహించినారనిన నేమిబాధగలదో! ఇది తత్వస్థితిగాని ఆరోపించి చెప్పుటగాదు.

పెద్దస్వాములగారిదినచర్య సూరిగారువ్రాసినది సత్యమే. వారీస్వామివారి దినచర్య నెచట నెక్కడ ఎపుడు అనుభవించిరి? ఇత్యాదిప్రశ్నలు నిరర్థకములు. సర్వసజ్జనసాక్షికమైన యీదినచర్యను కూపకూర్మము లెఱుగకున్న నేమినష్టము?

"శ్రీకపిస్థలం దేశికాచార్యులు మున్నగువారు కంచిస్వామివారిగ్రంథముల నభినందించినంతనే వారుశిష్యులయిరా?" అనుప్రశ్నమునకు సరియయిన సమాధానముచెప్పెద వినుడు. కంచిస్వామివారిసంప్రదాయము వేఱు; కపిస్థలంస్వామిసంప్రదాయము వేఱు వారభినందించినది సంప్రదాయార్థవిషయమునగాదు. వేదవిషయమున సంభవించిన వాక్యార్థములో కంచిస్వామివారి పరిశీలనమే ప్రామాణికమైనదని కపిస్థలం స్వాములు మున్నగువారు తటస్థదృష్ట్యా వ్రాసిరి. అచట ఆచార్యప్రతిపత్తిప్రస్తావంబునకే వీలులేదుగదా? మన మోటూరుస్వాములవారు ఉభయవేదాంతరహస్యసంప్రదాయార్థ విషయములోనే శ్రీకంచిస్వామివారి శతాధికగ్రంథముల నను

భవించి ఆయాగ్రంథములకును వారితనియనుల నిర్మించి తమ పుత్రరత్నమయిన బుచ్చన్నగారి హస్తాక్షరాలంకృతముగానే చేసియున్నారే. "వందే, భజే, సేవే, ప్రణమామి" ఇత్యాది రూపక్రియాపదఘటితములయిన తనియన్లుగదా కంచిస్వామి విషయమున మనపెద్దస్వాములు రచించినవి. అట్టి హస్తాక్షరి యికగూడ సురక్షితముగా నేయున్నది. "మోనముసాకారత త్వాఖ్యం దివ్యగ్రన్థం వినిర్మమే । అణ్ణంగరార్యం తంవన్దే విద్వదగ్రేసరం సదా ॥" "అతిమానుష స్తవస్య వ్యాఖ్యాం హృద్యాం చకార యోవిద్వాన్ । అణ్ణఙ్గరార్యవర్యం తం వందే విశ్వభోగ్యవాగమృతమ్॥" ఇత్యాద్యనేక తనియన్లు పెద్ద స్వామివారు రచించినవి అస్మదాదులకు కణ్ఠస్థములైయున్నవి.

* నిత్యాభివాంఛితపరస్పరనీచభావైః * అనురీతిగ పరస్పరము ఆచార్యప్రతిపత్తివహించుట ప్రాప్తమే. శ్రీవైష్ణవస్వరూపానురూపమైన యీవిషయమున రావుగారు అసూయవలన నేదేదోవ్రాయుట వీరికి స్వరూపవిరుద్ధము పంచసంస్కారకాలక్షేపముల సాయించినవారియందే ఆచార్యత్వబుద్ధి గలదు, ఇతరత్రలేదని వీరువ్రాయుట శ్రీవైష్ణవశాస్త్రార్థమున కొంచమైనను బోధములేకుండుటయే ౧౦ వపుటమున తానే వ్రాసియుండుటకును విరుద్ధముగదా?

మోటూరుస్వామివారివద్ద శ్రీమాన్ పురిపై శ్రీరంగాచార్యులు మన్నగువారు ఆచార్యప్రతిపత్తివహించియుండిరని సత్యముగ నొకరువ్రాసినయెడల దానిని ఈరావుగారాక్షేపింతురా? అందు అసమ్మతినో అతృప్తినో ప్రకటింతురా? పంచసంస్కారప్రాప్తిలేక గ్రంథకాలక్షేపాదులులేక ఆచార్యప్రతి

ప త్తియెట్లు ? అని అప్పుడువీరు ఆక్షేపింతురా ? అనవసరళు ష్క-వాదంబులేల ?

"శ్రీవారివంశము నకు స్వయమాచార్యపుం స్త్వము సుప్ర సిద్ధము" ఇత్యాదులంతయు అప్రసక్తప్రసంగములు. వీరికి కంచి స్వాములాచార్యులని యెవ్వరు వ్రాయలేదు. వ్రాసియుండు శబ్దసందర్భమునకర్థగ్రహణయోగ్యత లేదేయని శోకించుచు న్నాము. ఆచార్యవింశతివిషయము నెవ్వరునపలపింపజాలరు. ఈస్తోత్రమునక తత్వమీగ్రంథమున (లోపల) జూడవలయును.

మోటూరుస్వామివారికి పద్యరచనాశక్తియే లేదని యొకయబద్ధమును రావుగారువ్రాసిరి. ఇదియే సరియయిన యాచార్య సంభావన. శ్రీవారికి కాళిదాసభవభూత్యాదుల వలె కావ్యనాటకాదిరచనాశక్తి లేకున్నను తనియనులను చిన్నచిన్న స్తోత్రములను వారు చేయుచునేయుండిరని అనవర తము వారితోనేయుండియనుభవించిన మేముగదా యెఱుగు దము. వారు అనేకచరమశ్లోకములు స్తుతిపద్యములు సాయిం చిరి. వారిది మృదుమధురదివ్యవాణి.

ఈరావుగారును దంభుడును తమవ్రాతలో మాటిమా టికి స్వశుచమర్దనముతో బోలినదియని వ్రాయుచున్నారు. దీనినే వీరు మాటిమాటికి నుపయోగించుటచే వీరలకు పర స్త్రీకుచమర్దనమే న్యాయమనియుండుట వ్యక్తమగుచున్నది. ఇదియు నొకవిశేషమే.

"ఎవరయినను ఇతరులు తమపుత్రులనో బంధువు లనో 'గర్భదుర్భగః, మూర్ఖః' మున్నగుబూతులు తిట్టినచో"

ఇత్యాదులు నిర్లజ్జత్వప్రకాశకములేగదా? కలలో తమకుసంభవించిన పరిభవముల నెవరయిన బయటచెప్పగలరా? అయ్యో! ఇదియేమి స్వయంకృతానర్థము? ఎవరికిని తెలియక శ్రీముఖపత్రికలో వ్రాసినవిషయమును స్వయముగనే జగత్ప్రసిద్ధముచేసుకొని దానికి దృఢీకరణము, అతిదృఢీకరణము, అత్యంతదృఢీకరణము, శిలాలిపీకరణము తామ్రశాసనీకరణము ఇత్యాద్యనేకగ్రంథావతారమునకు తానే బీజావాపము చేయుచున్నారే!

"బుచ్చన్నగారు శోచించునట్లు వ్రాయుట కేవలమసత్యమ్మ"నుట వాస్తవమే. "ఈదంభుడు ఏదోచదువుచున్నాడే; మనవంశమునకు మంచిపేరు తెచ్చును, అనియుంటిని. అయ్యో! రెండక్షరములు వచ్చినవెంటనే భాగవతాపచారమునను ఆచార్యాపచారమునను పర్యవసించినదే" అని గతవత్సరంబున అతిమాత్రముగ శోకించిన ఆబుచ్చన్నగారే ఆశోకంబునువీడి ఆనందించుచున్నారిప్పుడు. మనయుపదేశంబుల నతిక్రమించి యథేచ్ఛంబుగ ప్రవర్తించిన వీనికిట్టిపరిభవము ఆవశ్యకమేయని యిపుడు ఆనందించియేయున్నారని నాకును తెలిసినదే ఇపుడు వారికి శోకమేలేదు, ఆనందమేగలదను విషయము నలపింపలేము.

దంభునకెంతపాండిత్యమ్మని సీతారాంబాగ్ పాఠశాలకువెళ్ళి విద్యాప్రదాతలను విచారించి తెలుసుకొనవలయునని రావుగారు వ్రాయుచున్నారు. ఇంతప్రయాసమెందుకో? ఈ దంభుడే తనపుస్తకములో తానే సుస్పష్టముగ తెల్పియున్నాడే. "నాకుశబ్దశాస్త్రమున జ్ఞానములేదు. ఏదోస్వల్పము

చదివినాను దైవదుర్విపాకముచేత సపచారపడితిని " ఇత్యాదులు ఆచంద్రార్కస్థాయిగ అతనిగ్రంథమునందుండుట సుస్పష్టమే. బహిష్కారదివ్యగ్రంథములో అన్నియు అత్యంతవిశదము లేగదా.

ఈదంభుని పాండిత్యమే మనరావుగారికిగూడ ప్రతిఫలించినది. పుటమనగనిది, పేరాఅనగనిదిఅని తెలియక పండిత దూషణముచేసినవాడు దంభుడని యీగ్రంథమున సువిశదముగ నిరూపితమైయున్నది మనరావుగారుకూడ ఇట్టిభ్రమముగలవారై మాటిమాటికి (పుటలో)అనిరి. ఈవిషయమును విద్వాంసులు విమర్శింపగలరు

రావుగారుకూడ దంభునివలె పండిత దూషణమే చేయుచున్నారు. డాక్టరు రంగాచార్యులశ్రీముఖపత్రికఅచ్చువేయబడియున్నది. వారు ఆపత్రికవ్రాసిపంపినది అసత్యమని వారు చెప్పినట్లు వీరును వ్రాయలేదు. సత్యమెట్లు అసత్యముకాగలదు. ముద్రించి ప్రకటించియుండు వారిశ్రీముఖము సురక్షితముగ నేయున్నది.

విద్వచ్ఛిరోమణియయిన శ్రీ రామానుజాచార్యస్వాములవారివిషయమున రావుగారు వ్రాసియుండువిషయమంతయు నబద్ధమేయని యీగ్రంథమున సువిశదము. తిరుక్కుడంద్యూరు రామానుజాచార్యులు మున్నగువారు వ్రాసియున్నది అత్యంతము సమంజసమే. విషయవిచారములేక వ్యర్థశుష్కశబ్దజాలములను వ్రాసిన ఫలములేదనియే వారువ్రాసిరి. ఇదియే సకలవిద్వాంసులు చెప్పదగినది. రావుగారు ప్రచురించి

యుండు ౧౬ పుటములలో శాస్త్రీయమైన విషయము ఒకటియయిన గలదా చూడుడు. ఇట్టి శుష్కకాగితములచే ప్రయోజనము లేదనియే విద్వాంసులు చెప్పగలరు మర్ఖగ దండనము, దుర్భగముండనము, మూర్ఖరసాయనము ఇత్యాద్యనేక గ్రంథరత్నములు ఆచంద్రార్కస్థాయిగ వెలుంగగలవని మన వకీలురావుగారు లోకమునకు ప్రకాశింపచేసియుండుట చాలమంచిదే. చాలకృతజ్ఞత

---

శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయ నమః. శ్రీమద్వరవరమునయే నమః.

దక్షిణహైదరాబాదనగరనివాసి, ఉభయభాషాపండిత

ఆయుర్వేదవిశారద వేఙ్కటరామసూరి ప్రణీతమైన

# దుర్భగదౌర్భాగ్యదృఢీకరణము.

శ్లో॥ యస్మిన్ సాపేక్ష్యపరోక్ష్య చ దుర్భగత్వం ప్రసిధ్యతి ।
తస్య తద్దృఢతామేష్యత్యేతాదృగ్గ్రన్థబృన్దతః ॥
మదిరేక్షణార్థవిషయే యద్యద్వక్తవ్యమనవశేషం తత్ ।
భూయః ప్రసిద్ధవిబుధై రఖిలైః ప్రాకాశి, తత్ర కిం వాచ్యమ్॥
దౌర్భాగ్యసీమ్ని తిష్ఠన్ కశ్చన దౌర్భాగ్యవైభవస్థేమ్న ।
అనుచితమనృతం చ వచో యద్యద్వ్యలిఖద్వ్యుదస్యతేతదిహ॥

## మొదటి భంగము.

౧. శ్రీతొండరడిపొడియాళ్వార్లు సాయించిన తిరుమాల యను దివ్యప్రబంధమున "కరువిలే తిరువిలాదీర్" (పా.౧౧) అని సంబోధించి తమ నిర్వేదమును ప్రకటించియున్నారు. "కరువిలే తిరువిలాదీర్" అను ద్రావిడవాక్యమునకు గర్భదుర్భగులారా! అని అర్థమనిరి వ్యాఖ్యాతలు. అట్టి గర్భదుర్భగులు ఎల్లప్పుడును అంతటను వ్యాపించియే యుందురు గదా! ఈ గ్రంథనామమున దుర్భగశబ్దమునకర్థమైన వ్యక్తి ఎవడనియందఱకు సుస్పష్టమే. అతడు తన దౌర్భాగ్యమును లోకప్రసిద్ధముగ జేయ ప్రబలప్రయత్నము చేయుచునున్నాడు.

ఆప్రయత్నఫలముగనే "దంభోళి" యను నొకపుస్తకము వెలువడియున్నదని యనేకముగ నందఱు నెఱుంగుదురు. ఆగ్రంథము సంస్కృతభాషలో నుండినను దానికిం జెందిన విషయములను తెనుగులోనే తేటతెల్లంబుగ దెల్పెద.

ఆ 'దంభోళి' గ్రంథకర్తయొక్క పేరును ఈగ్రంథమున మాటిమాటికి ప్రస్తాపింపవలసియుండునుగాన సౌకర్యార్థమై దంభుడుఅని సంగ్రహముగ వ్యవహరింతము. [ఈచిరునామము శ్రీభాష్యం కృష్ణమాచార్యులవారి శ్రీముఖమునుండి గృహీతమైనది.] ఈగ్రంథమును సంస్కృతభాషలో వ్రాయమికి ముఖ్యమయినకారణము :—దంభునకు సంస్కృతజ్ఞాన మతిస్వల్పమనియు వానిపుస్తకమంతయు నశుద్ధవాక్యబహుళమనియు విద్వాంసులనేకులు ప్రకటించియున్నారు దీనిని వీడే తను గ్రంథమున నొప్పుకొనియున్నాడు. "నేను వ్యాకరణశాస్త్రమున పరిచయము గలవాడుకాను. ఏదో కొంచముమాత్రము చదివినాను. నాకృతిని విద్వాంసులకు చూపింపకయే ప్రచురించితిని. నేను ఇంకయు విద్యార్థియే గదా ? నావాక్యములలో అపశబ్దము లుండినయెడల దోషమే లేదుగదా ?" అని వ్రాసియున్నాడు. శాస్త్రజ్ఞానము లేనివాడని వ్రాసినపుడు దానిని అనేక విద్వాంసులకు చూపి శబ్దదోషములను అర్థదోషములను సవరించి కూడినంతవఱకు శుద్ధముగగదా ప్రకటింపవలయును. శాస్త్రజ్ఞానము లేకుండుటచే తప్పులుగలవను సంగతియటుండనిండు. ప్రకృతము మనకు విషయమే ప్రధానముగాని శబ్దదోషములను చూడనుగూడ నవసరము లేదు. ఇతరులు వ్రాయునదిదియని కొంచమయిన నెఱుగ

శక్తిలేనివాడు గ్రంథము వ్రాయబూనుట యుపహాస్యమే. మహాసాహసమే. అత్యల్పవిషయములనే గ్రహింపనలవిలేని వీడు పెద్దపెద్దవిషయములను అసలే గ్రహింపజాలడని వివరింపవలయునా ? స్థాలీపులాకమనున్యాయము లోకప్రసిద్ధము, శాస్త్రప్రసిద్ధము. ఈరీతినే దంభుని సంస్కృతజ్ఞానవైభవము నతిసులభముగ నిర్ణయింపవచ్చును. దీనినందఱు నెఱుంగునటుల దిఙ్మాత్రము నిరూపించెదము.

3 ప్రస్తుత మీదంభుడు భట్టరుస్వాములొకరు వ్రాసియుండు పరిష్కారపరామర్శ మ్మనుగ్రంథమునకు ఖండనము వ్రాయనారంభించినాడు వీడు తమ దంభోళిలో ౪౧వ పుటమున ఆభట్టరుస్వాములను యథేచ్ఛముగ నిందించుచున్నాడు. ఆ పఙ్క్తులను అటులే యుదహరింతము చూడుడు. "సూరిణా పరామర్శే నిర్దిష్టేషు ౨౦, ౨౧, ౨౨, ౨౩ సంఖ్యాకశేఖరపుటేషు శకున్తలాఙ్గనాఙ్కనవిషయకప్రసఙ్గలేశోపి నాస్త్యేవ. సంఖ్యానిర్దేశవిపర్యాసః క్రియమాణః సూరేః కాణజనశిరోమణితామేవ ప్రతిపాదయతి. సంఖ్యానిర్దేశవైపరీత్యం ముద్రాపక ప్రమాదనిబంధనం నమన్తవ్యమ్... ...ఏతేన ప్రజ్ఞయా కాణత్వవత్ అక్ష్ణాకాణత్వమపి సూరౌ ప్రతిష్ఠాపితమ్." అని. ఈస్వల్పవిషయంబుచేతనే దంభునకు సంస్కృతభాషలో విపరీతజ్ఞానము దప్ప వేఱులేదని నిష్కర్షింపవచ్చును. ఇక దీని వివరింతము. భట్టరుస్వాములను సూరులు తమ పరామర్శగ్రంథమున ౨౫ వ పుటమున "శిరోమణిశేఖరే ౨౦, ౨౧, ౨౨, ౨౩, ౨౪ ఇత్యఙ్కైః పఙ్క్తిభిరుపపాదితాః సులలితాః విషయానవధేహి పునః" అని వ్రాసిరి. ఈసంస్కృతవాక్యం

బున కర్థంబు సంస్కృతమున స్వల్పపరిచయముకలవాఁడుకూడ అనాయాసముగ నెఱుఁగఁజాలును. “౨౦ to ౨౮ ఇత్యాదైః పఞ్చభిః” అని అయిదు నెంబర్లు ఆభట్టర్ స్వాములు చూపి యున్నారు. శిరోమణిశేఖరమను గ్రంథమున శ్రీవారు ౧ మొదలు ౫౦ వఱకు వరుసగ పేరా నెంబర్లు వేసి విషయముల నుపపాదించియున్నారు. అందు ౨౦ to ౨౮ వఱకుంగల విష యమును గమనించునట్లు భట్టరుస్వాములు వ్రాసియున్నారు. అయిదు పేరాలను గమనించునట్లు వ్రాసిరేగాని అయిదు ప్రకరణలను చూచునట్లు వారు వ్రాయలేదు. వాస్తవముగ నావిషయము ౨౦ to ౨౮ వఱకుంగల పేరాలలోనే యుండు టంజూడవచ్చును. “ఇత్యాద్యైః పఞ్చభిః ఉపపాదితాన్ విష యాన్” అను వాక్యమునకు ఈదంభుఁడు గ్రహించిన అర్థ మెద్ది? అని చూతుము. “పరామర్శే నిర్దిష్టేషు ౨౦ × ౨౩ సంఖ్యాకశేఖరపుటేషు.........ప్రసఙ్గలేశోఽపి నాస్త్యేవ” అని దంభుఁడు † వ్రాయుచున్నాఁడు. భట్టరుస్వాముల గ్రంథ మున పుటశబ్ద ప్రస్తావమయిన గలదా? బహిష్కార గ్రంథ మున నేను వరుసగ పేరా నెంబర్లను వేసి విషయములను వ్రాసియుండునటులే శిరోమణిశేఖరమునగూడ ౧ to ౫౦ వఱకు పేరా నెంబర్లు వేసి విషయనిరూపణము చేసియుండు టయు, అందు ౨౦ to ౨౮ వఱకుంగల పేరాలలో నుండు నటుల భట్టరుస్వాములు వ్రాసియుండు విషయము ఆపేరాల

---

† శాకున్తలనాటకే ప్రథమాఙ్కే మదిరేక్షణేత్యస్తీతిలిఖితే, తత్ర ప్రథమపృష్ఠే తన్నాస్త్యేవేతి దూషయితుం సజ్జో౽హ్యాయుం యథాజాత ఇతి శ్రీమన్తః కరిరామానుజాచార్యవర్య స్వామిపాదాః.

లోనే గలవనియు అపలాపము చేయరానివిషయము. ‘ ఇత్య జైః పంచభిః ’ అను వాక్యమునకు “ ఇత్యజవిశిష్టేషు పఞ్చసు పురేషు ” అను నర్థము సంస్కృతంబున స్వల్పప్రవేశముగలవారికికూడ స్ఫురింపదు. ఈయల్పజ్ఞాదల్పజ్ఞదంభుడు తానుఅట్టివిపరీతార్థంబును గ్రహించినదేగాక మహాజ్ఞాతలనియు లేఖనప్రవీణులనియు సుప్రసిద్ధులయిన ఆభట్టరుస్వామిని అవలీలగనిందించుట యెంతసాహసము ? గీతాభాష్యారంభమున *సర్వాత్మనా అంధీకృతరా ష్ట్రః* అను నద్వైయవరులవాక్యమునకు ప్రథమలక్ష్యమయిన యీాద భుడు, భట్టరుస్వాములను గ్రుడ్డివారుగను తెలివిలేనివారుగను నిందించియుండుట, ఆ రెండుబిరుదములును తమకేయుండునట్లు స్థాపించుచున్నది. ఇట్లు అత్యల్పవిషయమునగూడ అజ్ఞానాన్యథాజ్ఞానపూర్తిగల యీాదంభుడు త్రిజగత్ప్రసిద్ధులయిన ఆచార్యసార్వభౌముల దివ్యశ్రీసూక్తులలో దోషోద్ఘాటనముచేయ నుంకించుట సూర్యునిమీాద నెంగిలియుమియుటకు సమానమేయగునుగదా ?

## రెండవ భంగము.

౮. ఈయొకవిషయంబునకు ఈదంభుడు ప్రామాణికమైన సమాధానము వ్రాయుగాక, ఆసమాధానము వచ్చినపిమ్మట ఇతరవిషయములను వ్రాయవచ్చునని నేను మిన్నక వుండవచ్చును. అయినను అవశ్యములయిన కొన్నివిషయములను తెల్పియే విరమించెద. ఈదంభుడు తమగ్రంథారంభమున పీఠికలో ప్రపంచమునగల విద్వాంసులనందఱను గర్దభులని నిందించుచున్నాడు. మదిరేక్షణార్థవిషయమున శ్రీవారి యభిప్రాయమునభినందించియున్న మహావిద్వాంసులందఱు గర్దభు

లని దూషించినవారి వివేకమెట్టిదని తెల్పవలయునా ? గోదా వరిజిల్లా, నైజాంస్టేటు, కృష్ణాజిల్లా, విశాఖపట్టణంజిల్లా, మద రాసుప్రాంతము అనునీ అయిదు మహామండలంబులలోనున్న ౨౦మహావిద్వాంసులు ఈదంభునియపార్థమును అంగీకరింపకు న్నారని పరిష్కారపరామర్శగ్రంథమునను నాబహిష్కార గ్రంథమునను సువిశదము. పెద్దకాలేజులలోను సంస్కృతపాఠ శాలలోనుప్రతిష్ఠితులయిన రాజపూజితులయిన విద్వాంసులను ఈదంభుడు గర్దభులని దూషించుచుండుటచే వారితేజంబునకే కొఱతయు కలుగనేరదు. ఇట్లు మొత్తముగ దూషించినదే గాక మహావిద్వాంసులను కొందఱను పేరెత్తికూడ అతిరూక్ష ముగ దూషించియున్నాడు. చూడుడు :— వరంగలులో శ్రీమదిత్యాది కోయిల్ రంగాచార్యస్వాములువారు విశ్వ ప్రసిద్ధమహాపండితులు. సుబోధకసుధీమణి, ఉపన్యాసకేస రీత్యాద్యనేక బిరుదాంకితులు, నైజామ్మండలమున అద్వితీయ వ్యక్తిగ ప్రకాశించుచున్నారనియు, సకలవిద్వత్సభలలోను పూజింపబడుచున్నారనియు, శ్రీభాష్య భగవద్విషయాదు లలో ప్రచండపండితులనియు నందఱునెఱుంగుదురు. అట్టి మహనీయులు పరమకృపచే నీదంభునకు హితోపదేశము గావించిరట. విభీషణుని రావణుడు *త్వాంతు ధిక్కులపాం సనమ్* అని చెప్పియుండుటను వినియుండుటచే తామకూడ నటులే గర్హించిననే తమ దుర్భగత్వము సుప్రతిష్ఠితంబగునని దలంచి తమ దంభోళిలో (౩౨వ పుటమున) "శ్రీకోయిలు రంగాచార్యా విద్వాంసః"......అని యారంభించి 'ఏషాం విచిత్రతమచరితాని ఇదమీయగ్రామస్థాఏవ కథయన్తి" అని

" నిజముఖదోషం నిర్మలేష్వపి దర్పణేషు సమర్పయన్తి "అను రీతిగ వ్రాసెను. లోకమున నెవరికయిన నేదయిన కొంచము సౌభాగ్యముండినయెడల నితరులసూయనొందుట సహజము. అట్లుండ శ్రీకోయిలు రంగాచార్యస్వామికి సర్వవిధసౌభాగ్యములును నిండియుండుటచే నామహనీయులయెడ కొందఱికసూయప్రబలి ఏదయిన దూషించుచున్నారని యందము. పూర్వాచార్యులయిన భగవద్భాష్యకారాదులే యీయాపదకు గుఱియయిరే. ఈదంభుడు ఆకాలంబున పుట్టియుండిన యెడల వారలనుకూడ ఉపాలంభనము చేయక యుండడుగదా? అసూయాధిక్యముచే నెవరెంతనిందించినను ఆయామహనీయులకుంగల అనితరసాధారణమయిన జ్ఞానాదులను అపలపింపవో దొంగలింపవో ఎవరికి నలవికాజాలదు. ఈదంభుడు ఇటులే మఱొక మహనీయులనుకూడ నిందించియున్నాడు. సింహాచలముననుండు శ్రీమత్తిరుమల పెద్దింటి సంపత్కుమారాచార్యులవారు సాహిత్యసామాన్యశాస్త్రాదులలో ప్రవీణులై ఉభయవేదాంతగ్రంథ ప్రవచనము చేయుచు శమదమాదిసంపన్నులై దివ్యతేజిష్ఠులై విలక్షణానుష్ఠానపరులై యుండువారు. అట్టి మహనీయులను ఈదంభుడు (Page ౧౮) "అథ సింహాచల సంపత్కుమారాచార్యాః" అని యారంభించి అనువాదా నర్హంబుగ దూషించెను. ఇంకయు "రామతీర్థస్థ గోవిందరాజభాష్యకారవైదుష్యమ్" అని యారంభించి వారి నింగూడ నిందించెను. వీనినన్నిటిని ఇచట అనువదించుటకూడ మహాపచారము. ఇట్లు మహావిద్వాంసులనందఱను ఒకొకరిగ వేరెత్తి నిందింపవలయునని ఈదంభునకాశకాబోలు. "అస్తు;

అన్యే మహాన్తో నమే పరిచితా ఇతి తత్రోదాసే" అని (Page ౧౬) వ్రాయుచున్నాడు. దీనిచే నీదంభునకు పరిచితులందఱు నిందాపాత్రులనియు, అపరిచితులు ఔదాసీన్యపాత్రులనియు తేలినది. దైవాధీనముగ న్యాయవేదాంత వాచస్పతీత్యాది బిరుదభూషిత సుప్రసిద్ధవైభవులగు, [నరసాపురివాస్తవ్యులు] తె. కం. రామానుజాచార్యస్వామి ప్రభృతులు ఈదంభుని నిందకు గుఱిగాక వీనికపరిచితులై యుండుటకు లోకమంతయు సంతసింపవలయును. ఈదంభుని ప్రవృత్తిని ఖండించియుండు మహావిద్వాంసులొకొక్కరును జగత్ప్రసిద్ధులేగాని సామాన్యులుగారు. అట్టివారిని అపరిచితులనివీడినది మహాక్షేమము. చిట్టిగూడూరు సంస్కృతకాలేజిలో బహుకాలముగ వ్యాకరణోపాధ్యాయులుగనుండు శ్రీమత్ కరి రామానుజాచార్యస్వాములు మహాప్రాజ్ఞులు. మహావివేకసంపన్నులు. వారే యీదంభుని యధికప్రసఙ్గమును అధికముగ ఖండించినవారనియే వారింగూర్చి బహువిధంబులుగ నిందించి అసత్యవచనంబులనేకములు వ్రాసెను. అందును ఈదంభుని యజ్ఞానాన్యథాజ్ఞానములే స్పష్టమగుటచే దానిని కొంచము నిరూపింతము. శ్రీ కరి. రామానుజాచార్యస్వాములు సింహాచలమున కొందఱు పండితులతో సంస్కృతభాషలో సల్లాపించుచుండునపుడు "కాంచీస్వామినాం సదర్థప్రతిష్ఠాపనేషు ఆగ్రహాః నతావదాగన్తుకః, అపితు జన్మసిద్ధః; ఏవమాగ్రహాః అన్యేషామపి విదుషామస్తిచేత్ శోభనంస్యాత్" అని చెప్పుచుండిరట. ఆగ్రహమనునది సంస్కృతపదమేకాని తెనుగుపదముకాదు. ఈసంస్కృతపదమునకు [ఆదరః అభినివేశః] అనియే సకలకోశ

ప్రసిద్ధార్థము. ఆపదమును తెలుగున వేఱర్థమున నుపయో గించుచున్నారు. సంస్కృతభాషలో జరిగిన సల్లాపంబున నా పదము సరియయిన యర్థముననే యుపయోగింపబడినది. శతాధికగ్రంథముల రచించి సదర్థముల స్థాపించువిషయమున కాంచీస్వామి కాగ్రహము [అభినివేశము] ఒన్నుసిద్ధముగనున్న దనియు, ఇటులే ఇక కొందఱు పండితులుండినయెడల లోకం బునకు క్షేమము ఏర్పడుననియు కరి రామానుజాచార్యస్వా ములు చెప్పియుండ, దానిని విపరీతముగ వ్రాయుట విపరీత జ్ఞానవైభవము ననగును. విప్రలంభార్థముగనగును. ఇవ్విష యము శ్రీమత్ కరి రామానుజాచార్యస్వాములకే వ్రాసి యెఱు గబడెను. వారును తమ శ్రీముఖముయొక్క చివర "విపరీత జ్ఞానస్య విప్రలిప్సాయాశ్చ నిధినా తేన స్వకగ్రంథే సప్తమ పుటే లిఖితం సర్వథాప్యసంభవి" అని వ్రాసియున్నారు. కనుక ఈదంభునకు సంస్కృతంబున అజ్ఞానాన్యథాజ్ఞాన విప్ర లంభములుదప్ప వేఱులేవని సర్వవిద్వద్గోష్ఠీవిదితము.

## మూఁడవ భంగము.

౫. పూర్వమీదంభుడు ప్రకటించిన పరిహారగ్రంథము పండితులోకరికేని జూపకయే ప్రకటింపఁబడియుండుటచేతనే అందు అపరిమితమైన అశుద్ధములు సంభవించి యున్నవనియు నిప్పుడు తానే వ్రాసియుండుటచే నీదంభోళిగ్రంథము వశ్య ముగ కొందఱు పండితులకుచూపియే ప్రకటింపబడియుండు నుగదా! ఈగ్రంథముండు విధమును మనము చెప్పుట యనవ సరము. చిట్టచివర శోధనపత్రికనుకూడ ప్రకటించెను. ఈశో ధనపత్రికవలనను దంభుని సంస్కృతజ్ఞానమహిమ స్పష్టమగును.

ఇందును స్థాలీపులాకన్యాయము ననుసరించి యొకవిషయము నుమాత్రము చూపెదము. దంభోళిలో ౧౫ వ ప్రకరణలో 'ఆవిష్కృతః' అని తప్పుగ పడియున్నదనియు దానిని 'ఆవిష్కృతః' అని సవరించుకొనవలయుననియు శోధనపత్రికలో వ్రాసెను వీడు నాకు సహపాఠియని పరిష్కారగ్రంథమున వ్రాసెగదా? ఇతడు 'కృత్వా' అని చెప్పవలసినయెడల 'క్రుత్వా' అనియే చెప్పును. అటులే వ్రాయును. స్మృత్వా, వృత్వా, ధృత్వా ఇత్యాది పరస్సహస్రశబ్దములను రేఫవిశిష్టముగనే వీడు వుచ్చరించేది దీనిని నేను పలుసారులు ఖండించి యున్నాను. ఇంకను వీనికి ఆదురాగ్రసనయే అనువర్తించుచున్నది. ఆవిష్కృతః అనుపదమును సంస్కృతభాషలో నెవరైన వినియుందురా? దీనిని శోధనపత్రికలో వ్రాసి యిట్లు పరిహాస్యుడుకావలయునా? శోధనపత్రికకు శోధనపత్రిక, దానికొకశోధనపత్రిక. ఇటులనే అనవస్థాపన్నముగ ప్రచురింపవలసినవాడుగదా ఈ దంభుడు. ప్రపంచమునగల పండితులనందఱను నిందించుటకే నియే పుట్టియుండు వీనియొక్క దంభోళి గ్రంథము ఎట్లు కుదురవలయునో అటులే కుదిరినందులకు మహాసంతోషమే.

౬. విద్వాంసులనందఱను గర్దభములని నిందించిన యీదంభుడు కొన్నిరాసభములను వెదకి తెచ్చి నాతో మీరుననుగానము చేయుడని యెగబోలు. అందుకు నొకరును ఒప్పకుండుటచే తత్లోక్యవరులయిన కొందఱసమీపించి కన్నీరురాలువడ నేడ్వ వారు నొకవిధముగ సమాధానపఱచినట్లు తెలియుచున్నది. దంభోళిగ్రంథారంభమున "శ్రీమన్మహావిద్వద్వరా

ణామభినందనపత్రాణి" అని మకుటమిడి రెండు మూడు వ్యాసములు కనబడుచున్నవి. శ్రీ. కో. వె. దేశికాచార్యులను వారిపత్రిక మొట్టమొదటనున్నది. విశ్వప్రసిద్ధులయిన ౨౦ విద్వాంసులు ఈదంభుని యధికప్రసంగమును ఖండించియుండుటనెఱింగియు వివేకులెవరయిన వీనికి చేయూతనిత్తురా? త్రిశంకువను నొకడు వ్యర్థాశనొంది వసిష్ఠాదిమహర్షులచే తిరస్కరింపబడియుండియు హఠముగ మఱొకరి నాశ్రయించి పడినపాటులు (శ్రీ)రామాయణప్రసిద్ధము (అస్తు) ఈదేశికాచార్యులు వ్రాసియుండునది యథార్థమైయున్నట్లు అందఱు సంతసించుచున్నారు. చూడుడు:—"ప్రశస్తిపత్రసంయోగాదసారః సారవానయది। తదా వ్యాఘ్రాజినాచ్ఛన్నః గర్దభో వ్యాఘ్రతామియాత్" అని యాపండితులు వ్రాసియున్నది సారతమమయినది. ఈదంభుడు వారినొంది 'నేనొకగ్రంథము వ్రాయగలను; దానికి మీరు ప్రశస్తిపత్రికదయచేయవలయు' నని ప్రార్థింప వారు ఈశ్లోకమును వ్రాసియిచ్చిరి. ఆశ్లోకమున కర్థమిట్టిదనికూడ తెలియకయే దానినికూడ ముద్రించి ప్రకటించికొన్న దంభునిసామర్థ్యమేసామర్థ్యము. రసికులందఱు నీయొకవిషయమునే విమర్శింపవలయును. ఈదంభుడు తనదంభోళిలో ౨౩వ పుటమున ౮ వ పఙ్క్తిలో "శ్రీ. కో. దేశికాచార్యస్వామినామభిప్రాయవచనేషు పరాస్తః" అని వ్రాసియుండుటచే నీదంభుని దంభోళి జనించుటకుపూర్వమే ఆదేశికాచార్యులపత్రిక వ్రాయబడినదనియు, ఆపత్రికనువ్రాసినవారు ఈదంభోళిని చూడకూడలేదనియు స్పష్టమగుచున్నది గదా? [కనుక దేశికాచార్యులు ఈదంభోళిని చూచినవారు

కారనియు దీనిని అభినందించినవారు కారనియు స్పష్టము.] తాను రచించిన గ్రంథమును పండితులు చూచినయెడల తన్నే గర్హింతురని యీదంభుడెఱింగియుండుటచే దీని నొకరికిని చూపక అసత్యమయిన ప్రశస్తిపత్రికలను తానే కల్పించి ప్రకటించికొనియుండుటయే యథార్థమని తేలినది. ఇట్టి విషయములను వివరించుట విరసమని ఈప్రస్తావములనింతతో నిల్పి కొన్ని ప్రధానతమవిషయముల వివరించెద.

౭. ఈదంభుడు దంభోళియారంభమున పరిష్కారపరామర్శము పరిష్కారబహిష్కారమను రెండుగ్రంథములును తనకు లభించియున్నట్లును చూచియున్నట్లును తెలిపియున్నాడు. ఈరెంటిలోను బహిష్కారగ్రంథమే మొట్టమొదట వెలువడియుండ, దానింగూర్చి యేదియువ్రాయక పరిష్కారపరామర్శగ్రంథమునుగూర్చియే ఏదోకొంచము వ్రాసియుండుటచేతనే విద్వాంసులు మర్మమెఱుంగగలరు. "తత్ర పరామర్శగ్రంథకర్తా మదీయవంశవృత్తముద్ఘాటయతి" అని యారంభించి వ్రాసియుండు విషయము తప్పు. పరామర్శ గ్రంథకర్తలు (భట్టరు) దక్షిణదేశ్యులు, వారికి వీరి వృత్తమొకటియు తెలియుటకు ప్రసక్తియే లేదు. నాబహిష్కారగ్రంథమువలననే యితని పూర్వవృత్తములను తెలిసికొన్నట్లు ఆరంభముననే వారు వ్రాసియున్నారు. ఇతని పితామహులు సహపురమున శ్రీభాష్యం కృష్ణమాచార్యుల తిరుమాళిగలోనే అనేకసంవత్సరములు వసించుచునుండిరి. ఇప్పుడుకూడ ఇతని పితృపితృవ్యాదులును అధికముగ వారిగృహముననే వసించుచున్నారు. ఇతని పూర్వవృత్తములన్నియు నాకృష్ణమాచా

ర్యులకే నాకన్న నధికముగ తెలుసును. ఆకృష్ణమాచార్యులే నాబహిష్కార గ్రంథమును కటాక్షించి సవరించి ముద్రించి ప్రకటించినవారు. అది యసత్యమని యీదంభుడు దంభోళిలో నొకమూల వ్రాసియుండుట యబద్ధము. శ్లోకమును వంచించుటకే యేర్పడిన యీవార్త కొంచమయినను నమ్మదగినది గాలేదు దీని నాకృష్ణమాచార్యులవారికే దెల్పి సత్యమును వ్రాసి యనుగ్రహింపవలయునని ప్రార్థించితిని. వారు వ్రాసి యంపిన వ్యాసమును అటులే ప్రకటింతము.

౮. శిలాసహాపురమున వేంచేసియుండు

## శ్రీభాష్యం కృష్ణమాచార్యస్వాముల వారి శ్రీముఖపత్రిక.

(తత్సంగ్రహమేయిది)

దంభోళిలో ౨ వ పుటయున "పరామర్శక స్తత్వాం నజానాతి. తదత్రా విష్కుర్మః" అని వ్రాసియుండు విషయమంతయు తప్పు. "నాతాతగారు కంచిస్వామియొద్ద పంచసంస్కారంబును లభింపలేదు, ఉభయవేదాంతగ్రంథ కాలక్షేపము చేయలేదు" అని దంభుడు వ్రాసినది నిజమే. ఇతని పితామహులకు కంచిస్వామియందు సమాశ్రయణమనియో గ్రంథకాలక్షేపమనియో ఎవరును వ్రాయలేదు ఉడైయవరులను పంచాచార్యపదాశ్రితులందరు. తిరుక్కోట్టియూరునంబి మొదలయిన మహాచార్యులయందు పంచసంస్కారము నొందలేదు, గ్రంథకాలక్షేపమును చేయలేదు. అయినను వారలయందు కొన్ని యర్థవిశేషములను వినియుండుటచేతనే వారుకూడ ఉడైయవరులకు ఆచార్యులయిరి. అటులే వీని తాతయు కంచిస్వామివద్ద ఆచార్యప్రతిపత్తి గల్గియుండిరను విషయము నైజామ్ ఇలాకా మొత్తము ప్రసిద్ధము. ఈదంభుడే దంభో

ళిలో "కాంచీస్వామి విరచిత విమర్శగ్రంథాంశవలోక్య తద్వైదుష్యమభినందిత మాసీదస్మత్పితృపితామహపాదైః" (కంచిస్వామి రచించిన గ్రంథముల నవలోకించి వారిపాండిత్యమును నా తాతగారును నా తండ్రిగారును కొనియాడుచుండిరి.) అని వ్రాసియుండుటచే నింతమాత్రమయిన నొప్పుకొన్నందులకు వీడు ధన్యుడే. ఇతని తాతగారు స్వాచార్యతనియనుతోబాటు కంచిస్వామి తనియనుకూడ యావచ్ఛరీరపాతము నిత్యానుసంధానము చేయుచుండినదియు, తమవారికిగూడనట్లే యనుసంధించునట్లు నియమించినదియు వారితోనే యుండిన నాకుగదా తెలియును. ఇతడు "అస్మదీయవంశస్య" అని యారంభించి వ్రాసిన తద్వంశమహిమంబంతయు వాస్తవమే. ఆవంశప్రభావంబు నెవరును అపలపింపలేదు. ఆక్షేపింపను లేదు. దీనిని వీడు విస్తరించినది వృథాగ్రంథవిస్తారము. వీని తాతగారు సద్వంశంబున నవతరించి సదాచార్యసంబంధము నొందిన సాత్త్వికాగ్రేసరులై యుండినందుననే ప్రాప్తవిషయంబున గుణక్రీతదాసులంబరని వస్తుస్థితి. దంభోళిలో (Page 4) "అస్యచ్చేదం రహస్యముద్ఘాటయామః । ద్వాత్రివత్సరేభ్యః పూర్వమేవ......" ఇత్యాదిగ వ్రాసియుండు విషయము అసత్యపుంజము. కంచిస్వాములు ౨-3 సంవత్సరములకు పూర్వమే ఖిలా సహాపురమునకు విచ్చేసియుండినట్లు వ్రాసినది తప్పు. మొట్టమొదటు ఏడువర్షములకు పూర్వమే వేంచేసిరి. అప్పుడే యితని తాతగారు కంచిస్వామిని మొట్టమొదట సేవించిరి. అయినను దానికి ౧౦ సంవత్సరములకు పూర్వమే వీని తాతగారు గ్రంథద్వారా కంచిస్వామివారి ప్రభావార్ణవంబున మగ్నులై యనేకానేక స్తుతిపద్యముల రచించి యనుసంధించుచుండిరి. నేరుగ సేవించినపిమ్మట వారి భక్తి మరింత ఉద్వేలమయ్యెను. కంచిస్వాములవారు ఆచార్యవింశతియను గ్రంథమును రచించినది వాస్తవమే. దానికి వీడు వ్రాసియుండు అవతారిక అత్యంతమసత్యము. నైజాము ప్రాంతములోనున్న శిష్యవర్గములకు నిత్యానుసంధేయముగా నొకానొక చిన్న స్తుతిగ్రంథము కావలయునని వీనితండ్రిగారు పినతండ్రిగారు నేనుచేరి కంచిస్వామివారిసన్నిధికి ప్రార్థనాపత్రికనంప, వారును పరమకృపచే మాప్రార్థనను వెంటనే పూర్తిగావించిరి. ఇంతేగాని

“విలక్షప్యాదయస్సన్తి” ఇత్యాదిగ వీడు వ్రాసినది అత్యంతమసంబద్ధము. “శ్రీభాష్యభగవద్విషయాది గ్రంథానాదాయ శిరసినిధాయ సశపథం” ఇత్యాదిగ వ్రాయుట వీని యధికప్రసఙ్గము. ఈవిషయమున శపథమునకు ప్రసక్తియేమి? ఆచార్యవింశతి వ్రాయలేదని యెవరు చెప్పగలరు? ఆచార్యవింశతికి ప్రతిసంభావనగా తాతగారు కంచిస్వామినిగూర్చి ౨-3 స్తుతి పద్యములు సాయించినట్లు వీడు వ్రాసినది యసత్యము. దీనికి సంబంధించిన తత్వములు వారితో నెల్లప్పుడునుండిన నాకేగదా తెలియును. “ఇకమీద నావంశవృత్తాన్తోద్ఘాటనముచేసిన కష్టమగున”ని దంభుడు వ్రాసియున్నాడు. ఇతని వంశవృత్తాన్తమునుగూర్చి ఎవరు నెట్టిప్రస్తాపంబును చేయలేదు. వీనితాత గారి వృత్తాన్తము ప్రసక్తమైనందున వ్రాయనయినది దానినింకయు వివరింపనవకాశమిచ్చినయెడల పరిపూర్ణముగ వివరింపసిద్ధమైయున్నాము.

కంచిస్వామి వీనినిగూర్చి గర్భదుర్భగుడు అని యప్రసక్తముగ వ్రాసిరనియు అందువలననే తాను తన చిరంతనభక్తిని మార్చుకొనవలసివచ్చినట్లును వ్రాసియున్నాడు. దానికిం జెందిన తత్వమంతయు నాకే తెలియునుగాన దానిని నేనే ప్రకటించెద. గతవర్షంబున వీనితండ్రిగారు కూనూరునుండి కంచిస్వామికి “నాకొమారుడు చిరంజీవి.........డు స్వామిపాదారవిందంబున అధ్యాత్మగ్రంథములను సేవింప నపేక్షించియున్నాడుగాన స్వామినిర్హేతుకకృపచే పరిపూర్ణముగ ననుగ్రహింపవలయున”ని ప్రార్థించి, వెంటనే ‘వీడు మదిరేక్షణార్థవిచారమున స్వామిగ్రంథములకు ఖండనముగా నొకపుస్తకము వ్రాసియున్నాడు, దానినిగూడ త్వరలో కటాక్షింపవలయున’ని వ్రాసియుండిరి. ఆయుత్తరము కంచికి వచ్చినప్పుడు నేను స్వామిసన్నిధిలోనే యుండినందున నేనుకూడ నాజాబును చూడనయ్యెను. అప్పుడు స్వామివారు “నాయందు చేయబోవు అధ్యాత్మగ్రంథకాలక్షేపమునకీఖండనగ్రంథరచన పూర్వాంగమైన ఈపహారసమర్పణమా యేమి?” అని సాయించిరి. ‘అయ్యో! వీడు మూర్ఖుడు, దుర్భగుడు, స్వయముగ బుద్ధిలేనివాడు” ఇత్యాది యథార్థసంగతులను స్వామిసన్నిధిలో విన్నవించితిని. ఆయుత్తరమునకు స్వామి బదులువ్రాయ

కయే మిన్నకుండిరి. తిరిగి కూనూరినుండి 'దాసుని విజ్ఞాపనకు జవాబులేదే' యని వీనితండ్రిగారువ్రాసిరి. దానికి యోగ్యమయిన ప్రత్యుత్తరమే స్వామివారు అనుగ్రహించిరి. కూనూరినుండివచ్చిన ఉత్తరములన్నియు నిప్పుడ కూడ నాయందేయున్నవి. వీనితండ్రిగారు అధ్యాత్మగ్రంథకాలక్షేప ప్రస్తావనచేయకయే తమపుత్రుని గ్రంథలేఖనమును మాత్రమే వ్రాసియుండినయెడల అప్పుడు మూర్ఖుడు గర్భదుర్భగుడు ఇత్యాదిశబ్దప్రయోగంబునకు ప్రసక్తియుండదుగదా, స్వయంకృతానర్థమే యిదియని వీని తండ్రిగారికి తెలియదా?

తనవంశము నట్టిదియిట్టిదియని ప్రశంసచేసుకొని నావంశమునకెట్లు శ్రీవారాచార్యులు కాగలరని యిపుడు దంభోళిలో ప్రశ్నించువీడే పరిష్కారగ్రంథమున శ్రీవారిని 'ఆచార్య! ఆచార్య!' అని మాటిమాటికి సంబోధించియున్నాడు. (శ్లో.) "ఆచార్య! నాస్మి భవదీయవచస్సు దోషానుద్ఘాటయేయమితి సంప్రతి సంప్రవృత్తః । నూనం మదీయ విపరీతమతిప్రకర్షాత్ యత్కించిదత్రకథితం తదిదంక్షమస్వ" ఇత్యాది శ్లోకములను పరవశముగనే గదా వ్రాసియున్నాడు. కాకయు పరిష్కారగ్రంథమున (Page 48) "యాలేఖినీ" ఇత్యాదిశ్లోకమున 'విధిదుర్విపాకాత్' అని తనదౌర్భాగ్యమును తానే ప్రకటించుకొన్న వీడే దుర్భగశబ్దానుగ్రహమునకేల నిర్వేదపడుచున్నాడు? ఈదంభుడు మొదటిగ్రంథముననే తన మనస్తాపకారణమును వ్రాసియున్నాడు. ఏదేదనగా, 2-3 సంవత్సరములకు పూర్వము తాను కొన్ని శ్లోకములరచించి స్వామికి చూపించినట్లును, అందుండు దోషములన్ను స్వామి చూపించుటచే తనకు విద్వాంసులముందఱ నవమానముగలిగినట్లును, ఆదుఃఖమే తనకసహ్యముగనున్నదనియు మొదటిగ్రంథమున వ్రాసి, యిపుడు 'గర్భదుర్భగుడ'ని స్వామివారు శ్రీముఖముసాయించినదే తనభక్తివిపర్యాసంబునకు కారణంబని వ్రాయుట వీని బాల్యచాపల్యంబునే స్థాపించుచున్నది. నన్నుగూర్చి దంభోళిలో ఏవేవో వ్రాసియున్నాడు. వీనికి ఘోర్జరిలో గొప్పపాండిత్యమున్నదని యందఱు నెఱింగినదే. జాగ్రత్తగా ఉండవలయునని హితబుద్ధ్యా శిక్షించి తెలియపఱచియున్నాను."

౯. పాఠకులారా! (శ్రీ)భాష్యం కృష్ణమాచార్యుల శ్రీ ముఖమునుండి యింతవఱకే యిపుడు ప్రచురించినాము. సమయమువచ్చినప్పుడు ఇతరభాగములుకూడ ప్రచురింపబడును.

## నాల్గవభంగము.

౧౦. దంభోళిలో (Page 5) "నిర్మత్సరై రస్యచ్ఛేదమవ ధీయతామ్। పరిపాకరపరామర్శ కర్తా స్వగ్రంధస్య సదుప దేశదానాత్మకతాం ప్రాచీకశత్. ఏవమస్మాభిరయాచితోఽపి స్వయమాచార్యతాం కామయతేకిము? అస్య అన్యశ్శిష్యః దుర్లభ ఆసీదివ" అని వ్రాసెను. భట్టరుస్వాములు నాయపేక్షలేకయే నాకేల సదుపదేశములు చేయుచున్నారు? వారికి వేరు శిష్యులు దొరకలేదా? అని యడిగియున్నాడు. ఐయో! వీని దౌర్భాగ్యప్రవాహమున కేమనగలము? భట్టరుస్వాములకు లోకమంత శిష్యులు నిండియుండుట సుప్రసిద్ధమే. వారి సదుపదేశముచే నెందఱో దిద్దుపాటునొందియున్నారు. నాయపేక్షలేకయే సదుపదేశమేల నాకు చేయుచున్నారని వ్రాయుచున్నాడు వీడు. అయ్యో! ఇదియేమి మౌఢ్యము. అపేక్షించినవార్కే యుపదేశించు గురువర్యుల కాచార్యత్వపూర్తి లేదనియు, అపేక్షలేకయే యుపదేశించువారలే సదాచార్యులనియు నాచార్యహృదయాదిగ్రంధములలో సిద్ధాంతపఱచియుండుటను వీడెట్లు ఎఱుగగలడు? రావణునకుపదేశించిన సీతాదేవి విభీషణుడు మున్నగువారందఱును, హిరణ్యునకుపదేశించిన ప్రహ్లాదుడు ఇటులనేకులు వారపేక్షించియా యుపదేశించిరి? *శొన్నాల్ విరోదమిదు ఆగిలుమ్ శొల్లువన్ కేణ్మినో* అని యుపదేశించిన నమ్మాళ్వార్లు సంసారులపేక్షిం

చియా ఉపదేశించిరి. *పయనన్ఱాకిలుమ్ పాజ్గలరాకిలుమ్ శెయల్నన్ఱాగ త్తిరు త్తిప్పణికొళ్వాన్* అని కణ్ణినుణ్ శిరుత్తాంబులో కొనియాడునట్లు అపేక్షానిరపేక్షముగగదా ఆళ్వార్లు పదేశించిరి. ఉడైయవరుల యుపదేశమును విశ్వప్రసిద్ధము. అనువృత్తిప్రసన్నాచార్యులు గాక కృపామాత్రప్రసన్నాచార్యులు లభించినందులకు వీడు ఎంతో కృతజ్ఞతానుసంధానము గదా చేయవలయును. భట్టరుస్వామి తనకు చేసినది దురుపదేశముగాదు, సదుపదేశమేయని తెలిసికొన్నందుకు ఎంతో సంతసింతము. ఆచార్యహృదయమున *ప్రహ్లాదవిభీషణర్ శొల్ కేళాద అరక్కరశురర్ పోల్వారై త్తడవిప్పిడిత్తు* అను శ్రీసూక్తిని జ్ఞాపకపఱచిన యీదంభుడు సన్నిహితులయిన కోయిల్ రంగాచార్యస్వాముల సదుపదేశములకే దిద్దుపాటునొందక, వారినే వాచామగోచరముగ దూషించునపుడు ఇవ్విషయమున నాశ్చర్యమేమి? అయినను ఈదంభుడు మంచిబుద్ధి గలిగి భట్టరుల యాచార్యత్వము నంగీకరించి "అస్తు, తదీయకౌతుకానుసారేణైవ తమిమం ఆచార్యేత్యేవసంబోధయామి" అని (Page 6లో) వ్రాసినందుకు సంతసింతము. సీతాపిరాట్టి రావణునిగూర్చి చెప్పియుండు వచనములలో *ఇహాసంతో నవా సంతి సతో వా నానువర్తసే । తథాహి విపరీతా తేబుద్ధిరాచారవర్జితా* అనునదే సారతమమయినది. విముఖుడును మహాపాతకియునగు నారావణునియందు పిరాట్టికిగల్గిన కృపాతిశయమెంతగొప్పది. ఇట్టి కృపాతిశయముచే నెందఱో మహాస్వీయులు పరశ్శతాధికులు ఈదంభునకు సింహాచలమువను ంతటను సదుపదేశములను వాచికముగను పత్రమూలము

గను అపరిమితముగ చేసియు ఫలించ లేదని తెలిసియు నేనిం కయు నుపదేశింప కుతూహలపడుచున్నాను. *త్వాంతు ధిక్కులపాంసనమ్* అని క్రూరమయిన నిందనొందినపిమ్మట కూడ విభీషణుడు *ననశ్య స్తముపేక్షేయం ప్రదీప్తం శరణం యథా* ఇత్యాదులచే తమయుపదేశరుచినేగదా ప్రదర్శిం చెను. ఫలప్రతీక్షలేకయే యెందఱును తమతమ కర్తవ్యమును చేయుచుండుట అవశ్యముగాన ఇట్టిసదుపదేశము లీదంభున కపరిమితముగా లభించుననుటకు సందేహమే లేదు.

౧౧. నాబహిష్కారగ్రంథమును అనేకవిద్వాంసులకు పంపితిని. వారందఱును నాకాశ్చర్యమయిన శ్రీముఖములను వ్రాసియున్నారు. అవియన్నియు నడవి కాచిన వెన్నెలపగిది కాకుండ పరమప్రయోజనావహంబు కావలయునని పరమసు హృత్తులనేకులు కోరినందున కూడినంతవఱకు కొన్ని శ్రీముఖ ముల నిచట ప్రచురించెద. వీనిచేనయినను దంభుడు సద్బుద్ధి గలిగి ఉజ్జీవించుమార్గమేర్పడునని నమ్మెద.

౧౨. రామతీర్థమున, కవితావతంస గానకళానిపుణే త్యాద్యనేకబిరుదభూషితులై ఆంధ్రమండలంబున సుప్రసిద్ధులై యుండు శ్రీమత్. కరి-నారాయణాచార్యులువారు తాలుం గూడ కరగునట్లు ౧౬ పుటలు శ్రీముఖమను గ్రహించి యున్నారు, అందుగల కొన్ని పద్యములను గద్యములనుకూడ ప్రచురించెద.

శ్రీరామతీర్థనివాసి పండితపరిబృఢ
కరి నారాయణాచార్యులవారి శ్రీముఖ సంగ్రహము.

ఈపద్యములను శ్రీవారిసన్నిధిలో సమర్పించవలయునని యాజ్ఞాపించి నాకుపంపించిరిగాని, లోకోపయోగముకొఱకు నేను ప్రచురించెద.

సీ. ద్యుమణిమార్గాన(గ ఖద్యోతమేగినలాగు
జ్వలనుపై నడరెడు శలభముగతి
ఫణిపతిపై వానపామెదిర్చినరీతిఁ
గొండెతో గొఱ్ఱె ఢీకొనినమాడ్కి
ఖగరాజుతోఁగోడి కలహింపఁగడఁగి న
ట్లంచతో వాయసంబడరులీల
సింగంబుపై నక్క చివ్వకేగినభంగి
మదకరిపై దోమ మార్కొనునటు

గీ. కనఁగ నీతోడఁ బ్రతివాదమునకుఁబూను
వారిసంగతి యట్టిదౌర్భాగ్యులకును
జయముకల్గునె? ప్రతివాదిభయకృదన్వ
హాయ! అణ్ణంగరార్య విద్వద్వరేణ్య!

సీ. కలువలతేని వెన్నెలతేటిలో హాయి
నోలిఁదానెఱుఁగునే ? మాలకాకి
తమ్మిపూఁదేనియ కమ్మఁదనమ్మి నిం
తయుఁ దానెఱుంగునే దర్దురమ్ము
సరసచందన మహాసౌరభంబిసుమంత
గ్రహియింప గల్గునే? గార్దభంబు
కమనీయవిమలముక్తామణీహారసం
పదలంబునొప్పునే మర్కటంబు.

గీ. సరసులకుఁగాక తావకసరళమృదుళ
లలితకవితాప్రసంగకౌశలమదెట్లు
ఖలపురోభాగులకు రుచిఁగలుగఁజేయు ?
స్వామి ! అణ్ణంగరార్య విద్వద్వరేణ్య !
భో శ్రీమన్ వేఙ్కటరామసూరిప్రవర !

సామాన్య పండితులకున్ను విద్వద్వరేణ్యులకున్ను పరమభోగ్యమైన పరిష్కారబహిష్కారమును అనేకపర్యాయము చదివి యానందనిర్భరుడైతిని ......ఈనడుమ దాసుడు శ్రీసింహాచలమువెళ్ళినపుడు......దుర్భగవృత్తము దాసునకు సర్వము తెలిసినది. ఆతడు శ్వశురగృహానిమిత్తముగ అసకృత్ అచ్చట వచ్చుచున్నాడట ఆకారసదృశప్రజ్ఞః- దివ్యమఙ్గళవిగ్రహమట. ధీవిశేషముకూడ అట్టిదేయట. ఈతన తోడియల్లుడు సమస్తవృత్తాన్తమును జెప్పినాడు. ఈతడు పరమమూర్ఖుడట. ఎంతటి యాప్తులైనవారు హితముచెప్పినను ఆహితవార్తలను భోగట్టాలనుగూడ వెంటనే పత్రికలో బ్రకటించివేయునట. ఎవ్వరితోడను స్నేహములేదట ఓంటరిగాఁ గూర్చుండి మహాగర్వధూర్వహుడై యెల్లప్పుడు నెవ్వరినో యొక్కరిని దూషించుచునేయుండునట ఎంతటిపెద్దలనైనను అతిసాహసముగాఁ బరుషోక్తులాడుచు బాపమార్జించుచుండునట. ఎవ్వరితోడనైనను బ్రసంగించెనా; అతికఠినశైలిలో గర్భకరకశముగా మాట్లాడునట. అఖర్వగర్వధూర్వహుడట. ఇంటిలో నెవ్వరుహితముచెప్పినను వినడట. పరమమూర్ఖాగ్రేసరుడని యచ్చటివారందఱును జెప్పియున్నారు. ఇట్టియోగ్యతలన్నియు జూడగా ఇదివఱలో బెద్దలు "ద్వావిమౌపురుషౌ

మూర్ఖౌ దశాననసుయోధనౌ । వనభంగంచ గోగ్రాహం దృష్ట్వా యుద్ధం పునఃపునః" అను శ్లోకము జ్ఞాపకమువచ్చి మునుపు ఇర్వురు మూర్ఖులేకాని, యిప్పుడు మువ్వురు మూర్ఖులుగా లోకమందేర్పడియున్నారని తోచుచున్నది. పూర్వమూర్ఖులవలెనే నవీనమూర్ఖుడుకూడ "దృష్ట్వా యుద్ధం పునఃపునః" చేయుస్వభావముకలవాడుగా నేగనబడుచున్నాడు. ... కంచిస్వామివారియొక్క వ్యాఖ్యానగ్రంథరత్నములను వారితనియనులననుసంధించియే ప్రవచనచేయుచున్నతండ్రిగారికి ఇట్టికొమారుడు పుట్టియున్నాడంటే అయ్యో! దుర్భగత్వముగాక యేమి?

సదరు కరి నారాయణాచార్యస్వాములవారనుగ్రహించిన
సంస్కృతశ్లోకములు.

మదిరాత్మ్యర్థవివాదే యాయాఃకృతయః ప్రసాదితా గురుభిః ।
తాఃఖలు రసికావిబుధా నిత్యంసంసేవ్య సంప్రసీదన్తి ॥
కశ్చన కుమతిర్మూర్ఖో దుర్భగమూర్ధన్యసార్వభౌమేన్ద్రః ।
యది నప్రసీదతీహా క్షతిరియతా కాస్విదుద్భవిష్యతినః ॥
"కలకణ్ఠగణాస్వాద్యే కామస్యాస్త్రే నిజాఙ్కురే ।
నిమ్బవృత్తిభిరుద్గీర్ణే నచూతః పరితప్యతే ॥" ఇతి ఖలు
మహాతాంసూక్తిర్విలసతి, తద్వత్క్రమేళకఃకశ్చిత్ ।
ఉద్గిరతు కామమనఘం స్వాదీయాంసం మహార్ధమథకింస్యాత్ ॥
సఖలు మితధీశ్చమన్దో దురాగ్రహీచేతి విశ్వతః ప్రథితమ్ ।
తస్మాదహామపి లలితానుపదేశాన్ సాధుసందిశామ్యహహ ॥
(తథాహి) రేరేత్వంబత మూర్ఖతాంత్యజ మహానణ్ణఙ్గరార్యప్రధీ
సింహాస్య ప్రతివాదిభీకరమహావంశేఽవతీర్ణస్యచ ।
క్ష్వేళాభీలగభీరధీరనినదస్సంశ్రూయతే సర్వదిక్కోణే

ష్వద్యయథేష్టమత్ర 'న చర' క్రోష్టోపిహితంశ్రూయతామ్ ॥
ఆగర్భసిద్ధదౌర్భాగ్యః కథంశ్రోష్యతి హాహితమ్ ।
పితరంచ పితృవ్యాంశ్చ ధిక్కుర్వన్నేష తామ్యతు ॥
సాధవః స్వామిపాదేషుమహాభక్త్యుజ్జ్వలాశ్చ తే ।
హాహన్త కాపథే ధూర్తమేనం కథమివాత్యజన్ ॥
అస్మత్పుత్రో మహాశూరో జాతఇత్యల్పతృప్తిగాః ।
తేఽమీ సర్వత్రధిక్కారం దృష్ట్వా కింనానుశేరతే ॥
బాల్యే దౌర్భాగ్యమేతాదృగపఖ్యాతిశ్చ శాశ్వతీ ।
ఇతిదుఃఖం సమిన్ధానం నకథం చిన్తయన్తి తే ॥
భూయోభూయశ్చ కిమపికిమప్యల్పం లిఖన్జడః ।
గర్భదుర్భగతాదార్ఢ్యాదస్యద్యోత్స్యతి కింనుభోః ॥
జగదాచార్యసింహాసనాధీశత్వే సదర్పితే ।
అసూయాంఖ్యాపయన్నేష ఏకఏవావసీదతు ॥

ఆచార్యానహామవమన్తుమేవ జాతోస్మీత్యేవం లిఖతి
మదాన్ధదుర్భగోఽసౌ । దౌర్భాగ్యం బతబత యావదస్తి
నైజం తావచ్చ స్ఫుటతరమేవ భాతుభూయః ॥

అవజానన్తి మాంమూఢా ఇతిగీతాసుభాసతే ।
కంసరావణచైద్యాద్యా యదర్థంజజ్ఞిరేపురా ॥
తదర్థమేవ మూర్ఖోపి సోయంజాతఇతిధ్రువమ్ ।
స్వజన్మనఃఫలం హన్త సోయం పశ్యతు హాన్తగమ్ ॥
తేషామివాస్యచాప్యస్తు కీర్తిశ్శాశ్వతికీ భువి ।
విమతేవ్యోమ్ని జమ్బాలం యావచ్ఛక్తి కిరత్వసౌ ॥
ద్యుమణింవీక్ష్య నిష్ఠీవత్వన్యదన్యద్యథేప్సితమ్ ।
యథాకామమనుష్ఠాయ హృష్టఃపుష్టో భవత్వసౌ ।

అత్యల్పమేవపఠితం విదితంతతోఽల్పం
దౌర్భాగ్యకీర్తిరతులా మహతీ సమృద్ధా ।
సర్వత్రపణ్డితవరైర్మహితానుభావైః
ధిక్కారమేష లభతే సుతరామనల్పమ్ ॥
భగవద్గుణగణచిన్తనకథనవిఖనవిచక్షణాస్సుధియః ।
మణ్డూకమేనమహహ స్మర్తుంమనసాపి నార్హన్తి ॥
ఏతత్త్వవశ్యమేవ బ్రవీమి భూయశ్చభూయఏవాహమ్ ।
తాతోఽస్య శోచ్యశోచ్యోయ ఏనమేతాదృశం వ్యధాద్బాల్యే ॥

## ఐదవ భంగము.

విజయనగరవాస్తవ్య విద్వద్వరేణ్య. సంస్కృత కాలేజ్ ప్రొఫసర్ శ్రీమాన్
పరవస్తు గోవిన్దాచార్యస్వాములవారియొక్క శ్రీముఖము

......అవద్యైకనికేతనే దంభోళికుగ్రన్థే మన్నామగ్రహణపూర్వకం యదలేఖి తత్సర్వథాఽప్యతథ్యమపష్ఠు చ. శ్రీశ్రీస్వామిపాదదివ్యసూక్తయ ఆచన్ద్రార్కకీర్త్యుజ్జ్వలా విద్యోతేరన్నిత్యత్ర కస్యకస్సన్దేహః. దంభోళికారస్యవచాంసి సర్వథా విగేయాని బాలిశభాషితానీతి విద్వద్గోష్ఠీబహిష్కీకరణార్హాణీత్యసంశయమేతత్. శకున్తలా యదా దుష్యన్తేనావలోకితా, తదా సా అసితేక్షణా నాసీదితి ప్రసభం ప్రత్యవతిష్ఠమానోఽయం మన్దభాగ్య ఏతద్విమృశతు- అశోకవనమధితిష్ఠన్తీ భగవతీ జానకీ తదాత్వే కిం దృగీక్షణాఽఽసీదితి. తదా సా నాసీదఞ్జనాఞ్చితనయనేతి నిర్వివాదమిదమ్. తథాపి సా “అసితేక్షణే”తిహి అసకృదభిహితా. “తుల్యశీలవయోవృత్తాం... ......తంచేయమసితేక్షణా” ఇతిహిమారుతిరాహ.

అశోకవనే సీతాసతతమఞ్జనాఞ్చనకృత్యతత్పరాసీది

త్యేవఖలువక్తవ్యం పరైః. అతిరమణీయంహి వచఇదమ్.
భగవతీంవైదేహీమధికృత్య అసితేక్షణేతిప్రయోగో వాల్మీకి
రామాయణే శతకృత్వః ప్రేక్ష్యతే. సీతాందృష్ట్వా లఙ్కాతో
వినిష్క్రమ్య సమాగతస్యహనూమతో వచనామృతశ్రవణ
సమనన్తరం "నజీవేయంక్షణమపి వినా తామసితేక్షణామ్"
ఇతిభగవాన్ రామచంద్రోబభాషే. అథ పట్టాభిషేకసమయే
బహుమానప్రకరణే "అవముచ్యాత్మనః కణ్ఠాత్ హారం
జనకనన్దినీ। ......దదౌసా వాయుపుత్రాయ తంహారమసి
తేక్షణా॥" ఇత్యుచ్యతే ఆస్తామేవమన్యత్రాన్యత్రచ బహు.
దీనాందశామాస్థితాం సపఙ్కామనలఙ్కారాం జానకీందృష్ట్వా
తదాత్వే "ఇయమసితేక్షణా" ఇతి యదుక్తం యథాదృష్టా
ర్థవాదినా హనుమతా; తదేతదేవఖలు ప్రాధాన్యేనపరామర్శ
నీయమ్. భగవద్విషయదివ్యగ్రన్థే *మైయార్ కరుఙ్కణ్ణిత్యా
దిస్థలేషు సర్వజ్ఞైరాచార్యవర్యైర్యదనుగృహీతం తదనాదర
ణీయమితి అతిధార్ష్ట్యేన విలిఖన్ జాల్మః శోచనీయోభృ
శమ్. ఆలఙ్కారికేష్వగ్రగణ్యాహి తే ఆచార్యసార్వభౌమాః.
ఉదాహృత శ్రీరామాయణసూక్తిమప్యనుసృత్యైవహి తైర
త్యన్తముచితమనుగృహీతమ్. *నీలంశ్రీనేత్రకాన్త్యేతి సుద
ర్శనశతకే *లక్ష్మీనేత్రోత్పలశ్రీసతతపరిచయాదేష సంవర్ధ
మానః......వపుషః కాలిమాకైటభారేరితి తత్త్వముక్తాక
లాపోపక్రమే, ఏవమేవమన్యత్రాన్యత్రచ ఆప్తైఃకవిభిర్గురుభిశ్చ
కథితమనవధికమనాలోచ్యమనాగపి, స్వచ్ఛన్దం యద్వాత
ద్వావిలిఖన్తం కమపివిద్యార్థినం వస్తూకృత్య పునఃపునర్విశే
షతోవిలేఖనం వివేకినామశోభనమితి విరమామః."

ఆర్యులారా! మహావిద్వదగ్రేసరులైన శ్రీపరవస్తుస్వామివారు చతురశ్రముగ నిరూపించిన పరమార్థమతిభోగ్యము గదా. వైఖానసవ్రతములోనున్న శకుంతలకు అఞ్జనలేపప్రసక్తిలేనందున ఆమెకు నేత్రనైల్యమే లేదనియు, నీలవర్ణఖంజనపక్షి సాదృశ్యప్రసక్తియే లేదనియు దంభుడు వ్రాసినదంత విపరీతజ్ఞానఫలమని తేలినది. ఇదేగదా మూలేకుఠారము. *తం చేయమసితేక్షణా* అని చూపించినప్రమాణము పరమ రస్యము. అచ్చుట గోవిందరాజీయసూక్తి—“ అసితేక్షణేత్యధికవిశేషణదానాద్రామాపేక్షయా సీతాయా నయనసౌన్దర్యమధికమిత్యుచ్యతే ” అనియున్నది. ఇది స్త్రీనయనములకు స్వాభావికస్థితియేగాక ఆరోపితస్థితికాదని సుస్పష్టము.

---

## ఆలవ భంగము.

నెల్లూరు నగరవాస్తవ్యులై సాహిత్యశాస్త్రసాగరపారదృశ్వులైన శ్రీమదష్టగోత్రాభిజన

శ్రీమత్తిరుమలై అద్దంకి శఙ్కరాచార్యులయ్యవార్లంగారు అనుగ్రహించిన శ్రీముఖము.

శ్లో॥ మదిరేక్షణార్థతత్త్వప్రముఖానసవద్యహృద్యకృతి నిచయాన్! అసకృదవలోక్య హర్షప్రకర్షసిన్ధౌ నిమగ్నచిత్తోస్మి ॥ ౧ ॥ అత్ర కతిచిద్వృథాఖిలు మాత్సర్యం బిభ్రతో లిఖన్తి బత। అవిచారితరమణీయాస్తేషాం వాచో నపణ్డితాస్వాద్యాః ॥ ౨ ॥ హిత్వా విషయవిమర్శం వ్యర్థాన్ శాపాన్ సృజన్తితే హన్త। తాదృశశాపోక్తిభరైః శాస్త్రార్థఃకోపి కిం భవేద్గమితః? ॥ ౩॥ సోపహయాన్

ఖఞ్జరీటార్థం ప్రధానం, దృగ్విశేషతామ్ । సాధయన్
మదిరేత్యత్ర, మద్యార్థం తస్య ఖణ్డయన్ ॥ ౪ ॥ మది
రాక్ష్యర్థనిష్కర్షంనామ గ్రన్థం వ్యలేఖిషమ్ । సచాచిరా
త్ప్రకాశ్యేత విదుషాం హర్షవర్ధకః ॥ ౫ ॥ మద్యార్థఖణ్డ
నపరం ఖఞ్జనార్థసాధనసమర్థమ్ । గ్రన్థం మామక
మచిరాదనుభూయ బుధా భృశం ప్రహృష్యేయుః ॥ ౬ ॥

---

## ఏడవ భంగము.

### సత్యార్థ విజ్ఞాపన.

పాదుకాక్షేత్రము (ఒంగోలు తాలూకా నడిగడ్డపాలెము)

శిరోమణి వెంకటాచార్యస్వాములు.

మదిరేక్షణార్థవిచార మమితముగ పెరిగియుండుటను జూడ పరితాపముగ నున్నది. ఉభయవేదాంతములయందు చర్చింపవలసినవిషయములు వేలువేలుగనుండ నీయతిస్వల్ప విషయంబునకేల ఇంతటి గ్రంథవిస్తారమో? దీనిచే లోకమున కేలాభమో? అనియే నేను బహుకాలముదాసీనముగనుంటిని. ఇట్టులే పలువురు నుండవచ్చును. అయితే, సమీపకాలమున నేను శ్రీరఙ్గభట్టుస్వాములయొద్ద గొన్ని సద్విషయములంగ్రోలుభాగ్యము నొందినయపుడే ఈమదిరేక్షణార్థవిచారమున శ్రీవారు మూర్ధాభిషిక్తులై యుండుట యత్యావశ్యకమేయని విశదమయ్యె. ఈమదిరేక్షణార్థవిచారము కావ్యనాటకాదులకుంజెందిన విషయమనియు మనసంప్రదాయార్థములకుం జెందినదిగాదనియు, కనుక ఈవిషయమున విపులవిచారము వ్యర్థమనియు నేనుదలంచినదితప్పు అని యనుతపించితిని. మనము స్థాపింపవలసిన సంప్రదాయార్థములలో నిది

ముఖ్యమనియే శ్రీరంగం స్వాముల సల్లాపమువలన నెఱిగి తిని. దానిని కొంచము వివరింతను.

తిరుమంగైయాళ్వారు సాయించిన తిరునెడున్దాండగమున *మైవణ్ణనఱుఙ్కుఞ్జి* (౨౧) అనుపాశురమునకు భట్టరుల వ్యాఖ్యానమవతరించియుండుట జగత్ప్రసిద్ధము. ఈవ్యాఖ్యానము సుమారు ౭౦ సం॥ లకు పూర్వమే తెనుఁగు లిపిలోనచ్చయియున్నది. తర్వాత అరవలిపిలోను అచ్చయియున్నది. తెనుఁగులిపిప్రతిలో ౨౧౫ వ పుటమున *కుసుమాన్యపచిన్వ స్త్రీ చచార మదిరేక్షణా* అనుశ్లోకమును భట్టరుదహరించియున్నారు. ఈవ్యాఖ్యానమునకు వేదవ్యాసభట్టరు సాయించిన యరుంబదవ్యాఖ్యానమున 'మదిరేక్షణా' పదమునకు సమంజసమయిన వ్యాఖ్య చేయబడియున్నది. తిరుప్పావలో ఏడవపాశురమున "ఆనైచ్చాత్తన్" అని ప్రస్తావింపబడిన పక్షివిశేషమే మదిరశబ్దార్థమనియు, ఆపక్షికి నేత్రసౌందర్యమున ఔపమ్యప్రసిద్ధియుండుటచే 'ఆనైచ్చాత్తన్' అనుపదమునకు జ్ఞానచక్షుస్సౌందర్యముగలవారని స్వాపదేశార్థమనియు ప్రకటింపబడియున్నది ఇట్లు సంప్రదాయరసికులయిన యాచార్యులు ఆదరించిన యర్థవిశేషమును స్థాపించుటకే శ్రీవారు ప్రవర్తించిరని యెఱింగి నామనసు అపరిమితానందమునం దేలుచున్నది. ఈవిషయమున నింకయు విపులముగా వ్రాయనభిరుచిగలదు. వానినన్నింటిని కుపరిష్కారకుఠారమ్మను గ్రంథమున విస్తారముగ చూడగలరని యింతటితో విరమింతము. నాస్నేహితులొకరు వ్రాసిన పరిష్కారతిరస్కారముఁగూడ సహృదయహృదయంగమము.

---

శ్రీరస్తు.

హైదరాబాదనగరనివాసి. ఉభయభాషాపండిత.
ఆయుర్వేదవిశారద. వేఙ్కటరామ
సూరిప్రణీతమైన

# పరిష్కార బహిష్కారము.

హైదరాబాదనగరనివాసి. పండిత
శ్రీ సీతారామసూరులు వ్రాసిన సంస్కృతాను
వాదముతోఁ గూడినది.

నానాదేశీయ విద్వాంసుల ప్రశస్తిపత్రికా
బృంద సమలంకృతము.

ప్రకాశకులు:
ఖిలాసహాపురమ్. శ్రీభాష్యం కృష్ణమాచార్యులవారు

౧౯౨౬.

మూల్యము: ౧ రూ.

PRINTED AT THE
UNITED PRINTING WORKS, CONJEEVERAM

# సదుక్తి.

---

## మత్తేభవిక్రీడితము.

హితముం జెప్పెద మిత్రులార వినుఁడీ యింతేని కోపింపకే
మతిశాంతుండల వాదిభీకరుడు సన్మాన్యుండు విద్వద్గణ
స్తుతిపాత్రుండు విమర్శకాగ్రణియుఁదా దోషజ్ఞుడున్నిక్కమా
నతడున్ దూషణసేయ నర్హుఁడగునే యాత్మన్విచారింపుడీ
కృతులన్వ్రాందల లోకులందనిపి సత్కృత్యమ్ములన్ సంస్తుతుల్
మితిలేకుండఁగనొందుచుండ నకటా మేలైన ప్రేమంబునన్
స్తుతలం జేయఁగఁ జిత్తమొప్పదనినన్ దూష్ణీమవస్థానమే
యతియోగ్యమ్మగునట్లుగాక తమరాయాచార్యునిందించుచో
క్షితిసత్యమ్మెటులుండినన్ బహుజనస్నేహాన్వితుండౌటచే
నతనిం దోషవిహీనుగా నతని ప్రత్యర్థిన్ మహాదోషుగా
క్షితిపైబల్వురు చెప్పకుందురెసదా శీలంబురక్షించుకొం
చతినైపుణ్యము చూపియంటు తగదే యణ్ణఙ్గరాచార్య ద
ర్శిత మానర్థమె మేలుగాదు మదిరాక్షీశబ్దరత్నమ్ము కం
చతి మోదంబున జెప్పనొప్పుగదయొప్పైనన్వివాదమ్ము శాం
తతతోపీడి పరస్పరప్రియత నందన్యుక్తమూనిష్వదేన్ ॥

విద్యాప్రవీణ, భాషాప్రవీణ,
శ్రీ భాష్యం భాష్యకారాచార్యులు.
ప్రధాన పండితులు,
సింహాచల దేవస్థాన సంస్కృత పాఠశాల.

---

శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః

---

హైదరాబాదనగరనివాసి. ఉభయభాషాపణ్డిత,
ఆయుర్వేదవిశారద. వేఙ్కటరామసూరిప్రణీతమైన

# పరిష్కార బహిష్కారము.

౧. సంస్కృతంబున వనితలను 'మదిరేక్షణా, మదిరాక్షీ, మదిరలోచనం' మున్నగు శబ్దంబులచే వ్రాయుచున్నారు. ఈ పదార్థవిషయకవిచారము మూడు నాలుగు సంవత్సరంబుగ జరుగుచున్నది. ఈ విషయంబున ననేక గ్రంథములు సంస్కృత ద్రావిడభాషలలో వెలువడియున్నవి. ద్రావిడదేశంబున మాత్రము జరుగుచుండిన యీ వివాదమును తెనుగుదేశమునగూడ ప్రచారమునకు దెచ్చెను మన సోదరులగు కూనూరు రఘునాథాచార్యులు. తన యధికారంబునుమీఱి వీరు 'మదిరేక్షణార్థపరిష్కారం'బను క్షుద్రప్రబంధమును రచించి పండితులకు నంపిరనియు, అందఱును ఏకముఖముగ నా పుస్తకంబును తిరస్కరించిరనియు ప్రసిద్ధము. ఇట్టి పుస్తకవిషయముగ చర్చ యనవసరమే యయినను లోకమునకు తత్త్వార్థమును దెలుపవలయునని యనేక ప్రామాణికులు ఆజ్ఞాపించియుండుటచే నాయాజ్ఞను శిరసావహించి యీ పుస్తకమును రచించుచున్నాఁడను.

తెనుగు దేశంబుననుండు విద్వాంసులీగ్రంథంబుచే నుపకృతులగుదురని నా నమ్మకము.

౨. మొట్టమొదట నీవివాదము బయలుదేఱుటకు కారణమును 'శిరోమణి శేఖరము' మున్నగు పుస్తకముల ననుసరించి సంగ్రహముగ దెల్పెద. మదరాసు పట్టణమున తొండమండలం హైస్కూలులో స్థాపించియుండు సభలో శ్రీమాన్ కాంచీపురము ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు బహుకాలముగ నుపన్యసించుచున్నారు. ఒక్కొక్క యుపన్యాసంబునను పూర్వాచార్యశ్రీసూక్తులవలె కాళిదాస భవభూత్యాది మహాకవుల వాక్యములనుగూడ ప్రకరణవశంబుగ వివరించుచున్నారు. ఇట్లు ఒకానొకయుపన్యాసంబున * వైఖానసం కిమనయా వ్రత మను శాకుంతలశ్లోకమును ప్రసంగవశంబుగ వివరించిరి. ఈశ్లోకమున 'మదిరేక్షణవల్లభ' యని శకుంతలను నిర్దేశించెను. ఇచ్చట నవీనవ్యాఖ్యాతలుకొందఱు ''మదిరా-సురా, తద్వన్మాదకమీక్షణం యస్యాః సా మదిరేక్షణా'' (మదిరయనగ కల్లు. కల్లువలె నున్మాదముగల్గించు కన్నులుగలది మదిరేక్షణ) అని వ్యాఖ్యానించిరి. ఇట్టివ్యాఖ్యానము రమణీయముగ లేదనియు *మదిరోమత్తఖంజనః* అనుకోశవిశేషము నెఱుగక వ్రాసిరనియు శ్రీ స్వామివారు విశదముగ నుపన్యసించిరి. ఖంజరీటము ఖంజనము అని ప్రసిద్ధమయిన కాటుకపిట్టయను పక్షియే మదిర శబ్దార్థము. ఆ పక్షిబోలిన కన్నులుగలది యని యర్థము. అనేక

కవులు స్త్రీ నేత్రములను ఖంజనసమానముగ నందురు. ఇట్లీ యర్థమే సరసముగ సంభవింప రమణీయముగనుండ వే అర్థము చెప్పుట క్లిష్టగతియని శ్రీస్వామివారియుపన్యాస సారాంశము.

3. ఆయుపన్యాసమునకు ఆ చెన్నపట్టణపాఠ శాలావిద్యార్థులు కొందఱు వచ్చియుండిరి. వారు, తమ యుపాధ్యాయులు చెప్పిన యర్థము విరసము తప్పుఅని వీరు మహాసభలో స్థాపించిరనిదలంచి తమయుపాధ్యాయులయం దీచర్చ నారంభించిరి. అపుడు ప్రామాణికపండితులనేకులు శ్రీస్వామివారుపన్యసించిన యర్థమే సమంజసమని యామోదించిరి. కల్లయ్యంగారను పండితులొకరు మాత్ర ము 'మధురవాణి' యను దేశాంతర పత్రికయందు పైవిష యమును ఆక్షేపించి ప్రకటించిరి. స్వామివారును వెంటనే యావిషయమును ఖండించి యొక పుస్తకరూపముగ ప్రకా శించిరి. తిరిగియు నా కల్లయ్యంగారు ఆ మధురవాణిలోనే యావిషయమును ఖండింప స్వామివారును బదులువ్రాసిరి.

౪. పిమ్మట నీకల్లయ్యంగారుస్వామి కొంతకాల ము మౌనముగనుండి ఒకప్పుడు తమసహపాఠియయిన ఉద్యానపత్రికాధిపతులతో తమదుఃఖమునో అవజ్ఞనో చెప్పి వారి నీవిషయముగ వ్రాయ నేవగించిరి. వారును తమయుద్యానపత్రికలో వ్రాసిన విషయములను శ్రీస్వామి వారు వెంటనే వైదికమనోహర రసికరసాయనము అను

పత్రికలో ఖండించిరి. ఈ విషయమున శ్రీస్వామివారి యర్థమే న్యాయ్యము అని సుప్రసిద్ధపండితులనేకులు ప్రకటించిరి. ఆ లేఖలలో కొన్నిటిని ఈ పుస్తకమునగూడ ప్రచురించెదము......ఇట్లు అనేకపండితు లొప్పుకొనిన యీవిషయమున మనస్నేహితులయిన రఘునాథాచార్యులు ప్రవేశించి పరిష్కారమను పుస్తకమును రచించిరి: ఈ విషయము తమగ్రంథమున ౪౭-వ పుటమున కశాఘాత ప్రకరణమున తామే ప్రకటించిన స్వామివారి శ్రీముఖమును సత్యముగ జేయుచున్నదిగాబోలు.

౫. వీరెవరు? వీరేల పండితులందఱును నిందించు పుస్తకమును వ్రాసిరి? తన యధికారంబునకు తగని యీ (పెద్దలయందుఅపచారపడుటయను) కార్యమునఏల కాలిడిరి? ఇత్యాది విషయములను అవశ్యము తెల్పవలసియున్నది. విశ్వామిత్రమహర్షి రఘునాథునిగూర్చి *అహం వేద్మి మహాత్మాన మనినట్లు నేనుకూడ నీ రఘునాథునివిషయమున సత్యముగ దెల్పెద. వీరు మాకు చిరపరిచితులు. ప్రాణస్నేహితులు. మాసతీర్థ్యులు. వీరి విషయము నంతయు నెఱింగిన నేను ప్రసఙ్గవశంబుగ వాస్తవార్థమును దెల్పెద. శ్రీరఙ్గం తిరుమలై నల్లాన్ చక్రవర్తి (శ్రీనివాస) వరదాచార్యులను సుప్రసిద్ధులు మహనీయులు విద్యావినయసంపన్నులు నిజామురాష్ట్రమున శిష్యసమృద్ధియుక్తులు ఖిలాసహాపురమున వేంచేసియుండిరి. వీరు గతతారణభాద్రపద మాసమున తమ ౮౦-వ సంవత్సరమున పరమపదించిరి,

వారిదినచర్యననుభవించుభాగ్యము నాకబ్బియుండెను. వారెల్లప్పుడు శ్రీమదణ్ణంగరాచార్యులవారి శ్రీసూక్తులనే కాలక్షేపగ్రంథముగ స్వీకరించుచు, గద్యపద్యమణిప్రవాళ భాషామయములయినవారి శ్రీసూక్తులను అనవరతమువల్లె వేయుచు, పూర్వాచార్యసూక్తులకన్న ఇవియే యుజ్జీవన సాధనములని శిష్యులకుంజెప్పుచు, తమశిష్యులనందఱను అణ్ణంగరాచార్యస్వాములచరణంబుల ధ్యానింపజేయుచు, ఆ స్వామివారివిషయముగ తాము రచించిన స్తుతిపద్యములను తిరువారాధనాదికాలవిశేషంబున పఠించుచు నుండిరి. ఇప్పుడుకూడ నాస్తోత్రపద్యములు మాకు నిత్యానుసంధానోపయోగంబులుగనుండునవి. ఆశ్లోకముల నాలగవపాదము * అణ్ణంగరార్యో మమ దైవమాద్యం * అణ్ణంగరార్యం శరణం ప్రపద్యే * అణ్ణంగరార్యేణ వయం సనాథాః * అణ్ణంగరార్యాయ నమోనమోస్తు * అణ్ణంగరార్యాదపరోగురుర్న * అణ్ణంగరార్యస్య వచోఽమృతం మే * అణ్ణంగరార్యే మమ ధీస్సులగ్నా * అణ్ణంగరాచార్య! మతింప్రదేహి * ఇత్యాదిరూపముగ నుండును. వారి పుత్రులు ఐదుగురును తండ్రివలె జ్ఞానగుణాదులు నిండి శ్రీ స్వామివారియందు భక్తిపరిపూర్ణులై వెలయుచున్నారు. ఆ పుత్రులలోను జ్యేష్ఠులయిన శ్రీ పెద్దన్నగారును తృతీయులయిన బుచ్చన్నగారును విశిష్య స్వామివారియందు పరమ భక్తులై యుండువారు. పెద్దన్నగారు అని సుప్రసిద్ధ మహానీయుని జ్యేష్ఠపుత్రులయిన శ్రీనివాసతాతాచార్యుల

కుమారులే యీ రఘునాథాచార్యులు. వీరును తమ పెద్దల వలె స్వామివారికి పరమభక్తులై వారివిషయమయిన స్తోత్రములను అనవరతము అనుసంధించుచు నుండువారు. ఖిలాసహాపురమున శ్రీభాష్యం కృష్ణమాచార్యులను మహనీయుల గృహముననే ఈ రఘునాథాచార్యులపితామహాదులు వసించుచునుండిరి. ఆ కృష్ణమాచార్యులవారే యీ విషయములనన్నింటిని ప్రకటింప సిద్ధముగనున్నారని నమ్మెద.

౬. ప్రగతవత్సరంబున అణ్ణంగరాచార్యస్వాములు హైదరాబాదులో సీతారామబాగున పదిదినంబులుండి పండితభక్తప్రార్థనచే అనేకభాషలయందును అనేకోపన్యాసముల ననుగ్రహించిరి. అప్పుడీరఘునాథాచార్లవారు కూడ ప్రతిదినము మాతోనుండి ఆ యుపన్యాసములను అతిభక్తితో వినుచునుండిరి. ఒకప్పుడు వీరు నాతో "నేనొకపుస్తకంబును రచించియున్నాను. దానిని స్వామిసన్నిధిలో చదివి శోధించుకొనగోరెద. నేనే దీనిని తెలుపుకొన సంకోచించెద. మీరే యీవిషయమున పురుషకారము చేయవలయును" అనిరి. "ఈ సంకోచమేల?" యని చెప్పి స్వామికి విన్నవించితిని. స్వామినియమనముమీద వీరు చదువ నారంభించిరి. అప్పుడు పండితులు కొందఱు కూడ నుండిరి. వీరు కొన్ని కావ్యములనుమాత్రము చదివినవారుగదా? వీరిరచనలన్నియు నవద్యపరిపూర్ణములనుటకు వీరి పరిష్కారంబను పుస్తకమే సాక్షి. అనేకశబ్దదోషములు అర్థదోషములు నిండిన గ్రంథమురచించి పెద్దల

సన్నిధిలో చదువనారంభించిన వీరి సాహసము వాచామ గోచరము. తప్పులుండినయెడల నవశ్యముగ శోధింపవల యునని మాటిమాటికి స్వామిసన్నిధిలో ప్రార్థించుచునుండె ను. వారును శోధింపవలసినవానిని అచ్చటచ్చట చెప్పుచు నుండిరి. వచ్చియుండిన పండితులు నామోదించిరి. వీరో ఏదియు చెప్పక మఱలిరి. అప్పుడే వీరు నాయొద్ద 'స్వామి వారు నన్ననుగ్రహింపరయిరి. నేను అజ్ఞానాన్యథాజ్ఞాన ములు నిండియున్నట్లు పండితులయెదుట నిరూపించిరి గాన ఆ యవమానంబును సహింపలేను. తానొకటిదలంప మఱి యొకటి జరిగినది...' ఇత్యాదివిషయములను చెప్పుచుం డిరి. అప్పుడు నేను 'వర్ధిష్ణువగు నిన్ను స్వామి పూర్ణముగ అనుగ్రహించిరి. అందుకు వారియందు కృతజ్ఞతను జూపు ము' అని యుపదేశించితిని.

౭. ఐయో! ఇట్టి యుపదేశములు వీరియందు ఫలించునా? ఆదుఃఖమే క్రమక్రమముగ వీరికి వృద్ధియ య్యెను. ఆ దుఃఖముచేతనే వీరు తనస్వరూపవిరుద్ధమగు కార్యముల నారంభించిరి. ఈ వృత్తాంతమునే తమగ్రంథ మున ౪౧-వ పుటలో "అథైతదాస్తామ్; అన్యచ్చ" ఇత్యాదివాక్యమున సూచించిరి. తమగ్రంథమున పైవాక్య ములు వ్రాయుట యనవసరమని యెఱుంగరా? స్వామి పరిశోధనలను అపలపించి వేఱువిధముగ వ్రాసిరి. * శ్లోక ప్రీతిచకోరపారణపటుజ్యోతిష్మతీలోచనే * అను మురారి ప్రయోగము నుదహరించి స్వామివారు చెప్పినవిషయమును

వీరు వేఱువిధముగ వ్రాసిరి. ఈప్రకరణమున (౪౨-వపుట) "సారాసారవివేచనవ్యసనినా" మనుస్వామివారి శ్రీసూక్తిని ప్రదర్శించిరి. దీనిచే సమాససంగ్రహమునుగూడ వీరు చదువలేదని స్పష్టమగుచున్నదే. అట్టివీరు శాస్త్రీయవిషయముల నెఱుగగలరా! ఈ ప్రకరణమున వీరు వ్రాసిన దానిని జూడుడు:—"నాగ్రంథమున స్వామివారు కొన్ని దోషములను సప్రమాణముగ నుపపాదించిరను విషయమున నాకు కొంచమైనను కష్టములేదు. తప్పులేనిచోట గూడ తప్పులనుచెప్పినదిమాత్రము నన్నుకష్టపెట్టుచున్నది" అని వ్రాసియున్నారు. ఐయో! ఏ వివేకి యిట్లు వ్రాయగలరు. రెండుమూడు వర్షములకుపూర్వము జరిగిన యీ విషయమునకీగ్రంథమున ప్రసక్తి యేమి? అస్థానంబున గూడ స్వామి దోషములు చెప్పియుండినయెడల అప్పుడే పండితుల సమక్షమున నేల చర్చింపరయిరి? అప్పుడచట నుండిన విద్వాంసులందఱును స్వామిపక్షపాతులని మిన్నకుండిరేమో!

౮. ఇట్టి పుస్తక ప్రకాశనమువలన తనకు మహనీయుల నిందయే ఫలమయ్యెనని తామే తమగ్రంథమున ౫౫ - వ ప్రక్కలో వ్రాసిరి. ఇట్లువ్రాసిన వీరి తెలివికి ఏమనియెదము. లేఖనశైలినే వీరెఱుగరని కొంచము వివరింతము. ౪౭-వ పుటమున "మూర్ఖః గర్భదుర్భగః ఇత్యాది జల్పనం యుష్మన్మహీయస్త్వాయాః కలంకమాపాదయేదితి పునఃపునః ప్రార్థయే" (మూర్ఖుడు గర్భదరిద్రుడు ఇత్యాదివచనములు

తమగౌరవమునకు హానికరములని మాటిమాటికి (ప్రార్థిం
చెద) అని వ్రాసిరి. ఇచట ప్రార్థయే (ప్రార్థించెద) అని
వ్రాసిన వీరు ప్రార్థించువిషయమును తెలుపవలయును.
విన్నవించెదఅని చెప్పవలసినచోట ప్రార్థించెదఅని వ్రాయు
చున్నారు. 'ఇకమీద ఇట్లు వ్రాయగూడదని ప్రార్థించెద'
అని వ్రాసియుండిన సమంజసముగనుండును. మనసులో
నొకటి. వ్రాయుటయొకటి. జల్పనం (ప్రలపించుట) అను
నిందోక్తికిని ప్రార్థయే యను వినయోక్తికిని సంబంధమే
మని యడుగవలయును. ౨౮-వ ప్రక్కలో "యా లేఖనీ
పురా మయ్యాశీశ్శతమర్పయన్త్యాసీత్। సైవ విధిదుర్విపా
కాత్ శాపశతం కటు సముద్గిరతి" (ఏకలము పూర్వము
నన్నాశీర్వదించుచునుండినదో; అదియే యిపుడు నాదౌర్భా
గ్యవశంబున క్రూరశాపంబులం గక్కుచునున్నదే) అని
వ్రాసిరి. చిరకాలముగ శ్రీమదణ్ణంగరాచార్యస్వాములకృపా
పాత్రముగనుండిన తాను ఇప్పుడు తన దౌర్భాగ్యవశంబున
వారినిగ్రహమునకు పాత్రమైనట్లు వ్రాసినది సత్యమేయని
సంతసింతము. మహనీయుల యనుగ్రహము నిర్హేతుకము,
నిగ్రహమట్లుకాదని యెఱుంగుదురుగాక. తమదౌర్భాగ్యమే
నిగ్రహకారణమని యెఱింగి ప్రకటించినవీరికి స్వామివారు
ప్రయోగించిన దుర్భగశబ్దంబుచే రోషముగల్గుటకు నేమి
కారణము?

౯. బహుకాలముగ స్వామివారియాశీర్వాదము
నకు వీరు పాత్రముగనుండిరిగాన స్వామిని దూషింప

వలయునని యే ఆరంభించిన వీరియొక్క గ్రంధమునగూడ * యథార్థ్యం కేశవే వృత్తిమవశాః ప్రతిపేదిరే * అను రీతిగ అవశముగవచ్చిన కొన్నివచనములు స్వామియం దుండు అద్భుతమయినభక్తిని తెలుపుచున్నవని సంతసిం తము. చూడుడు. ౪౭-వ పుటలో:—"స్వామిపాదాః బహుశ్రుతాః శతాధికగ్రంధప్రణేతారః లోకోపకారార్థ మేవ భువి న్యస్తపాదాశ్చేతి నాత్ర సందేహగంధోపి" (స్వామివారు నూటికధికముగ గ్రంథముల రచించినవారు, లోకోపకారార్థమే యవతరించినవారు అను విషయమున సందేహమే లేదు) అని వ్రాసిరి. గ్రంధము చివరగూడ (౧౬౬-వ పుటమున) శ్లో. "స్వామిన్! శ్రీ ప్రతివాదిభీకర గురో! దాసానుదాసస్సదా యుష్మత్పాదయుగం ప్రణమ్య శిరసా యాచేఽహమత్యాదరాత్। దాసే మయ్యతిమాత్ర మైవ కృపయా సర్వాపరాధా ఇమే క్షంతవ్యా గుణలోలు పేన భవతా సద్వంశసంభూతినా" (స్వామీ! శ్రీవాది భయంకరాచార్యా! మీచరణారవిందంబుల మ్రొక్కి యాచించెద. మంచివంశంబున నవతరించిన గుణగ్రాహి యయిన తాము దాసుడొనర్చిన యీయపచారముల నన్నింటిని మన్నింతురుగాక) యని సవినయముగ ప్రార్థించు చున్నారు. పీఠికలోను ౮-వ పుటమున "ఆచార్య! నాస్మి భవదీయవచస్సు దోషాన్ ఉద్ఘాటయేయమితి సంప్రతి సంప్రవృత్తః. నూనం మదీయవిపరీతమతిప్రకర్షాత్ యత్కిం చిదత్రకథితం తదిదంక్షమస్వ" (స్వామీ! నేను తమ

వాక్యంబున దోషంబులను ప్రకటింపబూనలేదు. నా బుద్ధి వైపరీత్యంబువలన చెప్పినవానిని క్షమింతురుగాక) అనిరి. తమపూర్వుల ప్రతిపత్తిననుసరించి తమవాస్తవికస్థితికికూడ అనుగుణముగ 'ఆచార్య!' అని సంబోధించిరి. పిమ్మటం గూడ 'వాస్తవముగ తమ వచనంబులందు దోషములం జెప్పుటకేవిషయమును లేదు. అయినను నాబుద్ధిభ్రమముచే ఏదేదో పలవించుచున్నాను. వానిని మీరు క్షమింపవలయున'ని వ్రాసిరి. ౧౩-వ పుటమున "మనసి నిగృహీతేపి స్వైరం చచాల విలేఖనీ కథమహమిమాం బ్రూయాం దోషో మహాత్మను మాస్త్వితి। యత ఇయమచైతన్యా తస్మాద్భధోత్తమ లేఖనీవిహితమఖిలం పాపం క్షాన్త్వా దయస్వ నకుప్యభోః" (ఎంత నిలిపినను నిలువక యథేష్టముగ పరుగెత్తు అచేతనమయిన యీకలము చేసిన పాపములనన్నింటిని క్షమింతురుగాక) అనిరి. స్వామివిషయమున అపచారములం జింతించుటగూడ మహాపాతకంబనియు ఇట్టిదూషణవాక్యముల వ్రాయగూడదనియు మనంబును అణచుకొనపలుపాటుబడితిని. అయినను నాపాపబలంబువలన ఈ కలము యథేష్టముగ వ్రాయ నారంభించెను. ఆచార్యాపచారము మహాపాతకంబని యిది యెట్లు ఎఱుంగును? మహాపాపియగు నీకలమొనర్చిన యీ మహాపచారంబును మన్నింప నర్థించెద అనిరి. ఇట్లు ఆదిమధ్యావసానంబున వ్రాయుటయు దీనికి విరోధముగ దూషణవాక్యముల వ్రాయుటయు జూచిన సందఱకు వీరు పిచ్చివారని యే

తోచును. ఇట్లు వీరు తమపుస్తకమున భక్తిబలాత్కారము వలన ననేకము వ్రాసియున్నారు; అవియన్నియు తమపితామహులు స్వామివారి విషయముగ సాయించిన స్తుతిమాలికను నిత్యమనుసంధించుటచే గల్గిన ఫలము. అపచారకారణమో వివరింపబడియున్నదే. ౪౭-వ పుటమున తానే ప్రకటించిన స్వామివారి శ్రీముఖముకూడ వాస్తవిక కారణమును దెల్పుచున్నయదే.

౧౦. వీరిగ్రంథమును జూచినపుడు శ్లో. "కపిరపిచ కాపిశాయనమదమత్తః-వృశ్చికేన సందష్టః। అపిచ పిశాచగ్రస్తః కింబ్రూమో వైకృతం తస్య" (తానోకోతి, కల్లు ద్రాగియున్నది, తేలుగఱచియున్నది, గాలిపట్టియున్నది, అపుడదిచేయుచేష్టల నేమనియెదము.) అనుశ్లోకమే జ్ఞాపకమునకు వచ్చుచున్నది. స్వాభావికముగనే దోషపరిపూర్ణముగ వ్రాసిన వీరిపుస్తకమున అపరిమితముగ అచ్చుతప్పులు కూడ గలవని తామే వ్రాసియున్నారు. అందఱు నేమార్చు వాక్యములుగదా యివి. పండితులీగ్రంథమున తప్పులంజూప నారంభించినయెడల వీరు 'ఇవియన్నియు నాతప్పులుగావు. అచ్చుతప్పులే. దీనినిగూడ నాగ్రంథమున స్పష్టముగ తెల్పియున్నానే' అనియో, 'నేను మహాపండితుడే. నా వచనంబులందుకూడ తప్పులేవయిననుండునా' అనియో సమాధానము చెప్పుటకే వీరు బుద్ధిపూర్వకముగ అచ్చుతప్పులను గావించిరి. తప్పులను దిద్దియేగదా పుస్తకమును ప్రచురింపవలయును. అక్షిణే, వక్ష్యేత, క్షచికథపితమ్, ఖద్యామః

ఖద్యోతః, సంజంగమీతే, లిప్సతః, క్షమాపయితుం, నిర్వ్యథవ్యః, ఉత్కర్షాయై, వ్యరీరచత్, ఇత్యాది అపశబ్ద శతములు నిండియున్న యీ గ్రంథమును శ్రీ ప్రతివాది భయంకరాచార్యసింహము చూడగూడ కూడదని చిట్టిగూడూరు నరసింహ విద్యాలయ వ్యాకరణోపాధ్యాయులు శ్రీమాన్ కరి రామానుజాచార్యస్వామివారనుగ్రహించిరి. ఇట్లు అనేక పండితులు ఖండించు వీరికుగ్రంథమును మనబోటి వారు చూడకూడ కూడదు. వీరు లఘుకౌముదిలో సంధి ప్రకరణమునుకూడ చదువలేదని కొంచము నిరూపింతము. ౨-వ పుటమున "నానావిధశ్లోకేభ్య అవగమ్య" అని ప్రయోగించిరి. ఇచటి సంధినిజూచి రఘువంశము పఠించు బాలకుడుకూడ పరిహసించును. ౫౦-వ పుటమున 'వినిందన్తో కతినామ' యని వ్రాయుచున్నారు. శ్రీరామాయణ సంగ్రహముచదివినవాడుకూడ నవ్వును. ఇట్లుండ మహాపండితులమీద ధ్వజమెత్తిన వీరిసాహస మత్యాశ్చర్యము గదా! సంధిప్రకరణముకూడ ఎఱుగనివీరు స్వామివారిసూక్తిని జూచుటకుంగూడ అనధికారులని చెప్పవలయునా? 'సోయం మామకజీవనం గురురభూత్' అను తమ పద్యమున స్వామివారు దోషముచెప్పినట్లు వ్రాయుచున్నారు. (పుట ౪౨) ఏ వివేకి దీనిని నమ్మును. (౪౩-వ పుటమున) 'విమర్శించినయెడల స్వామివారి గ్రంథమందుకూడ తప్పు లగుపడును. వానినికూడ చూపెద' అని ప్రతిజ్ఞచేసి స్వామిరచించిన గ్రంథములనన్నింటిని చాతూవిడవక రేయింబవళ్ళుచూచి

కష్టపడి రెండుమూడుతప్పుల నెత్తెను. దీనికి గానైనను స్వామివారిగ్రంథముల నొకపరి సావధానంబుగ సేవించి జ్ఞానాభివృద్ధిని పుణ్యంబు నొందినందులకు సంతసింతము. దీనికిపూర్వముకూడ రెండుమూడు మహామహోపాధ్యాయులును విద్వాంసులు కొందఱును స్వామి సూక్తులందు దోషములనెత్తఁబూని, చిట్టచివర మహాలోకోపకారంబును చేసినట్లు పేరొందిరి. వీరుకూడ అటులే కాగలరు. ఇక వీరు స్వామివారి గ్రంథమున నెత్తియున్న దోషములను విమర్శింతము.

౧౧. స్వామివారు రచించిన తర్కశాస్త్రసర్వస్వమను గ్రంథముయొక్క మంగళశ్లోకమున 'కమలాధర రసచుంబ్యా' అను భగవంతునివిశేషణము నిట్లు ఆక్షేపించుచున్నారు. చుంబనము (ముద్దిడుట) అనగ వక్త్రసంయోగము (ముఖముతో చేర్చుట). అధరమం దది సంభవించును. రూపములేని గుణమయిన రసమందు అదియెట్లు సంభవించును? గుణమందు గుణమును శాస్త్రకారు లంగీకరింపరే అని. ఇదియేమి అస్థానేభ్రమమో. * రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే * అను గీతాశ్లోకము నొకటినిమాత్రము వీరెఱుగుదురుగాబోలు. రసమనగా అమృతము. అధరరసమన అధరామృతమె. అది రూపముగల వస్తువుగదా! * రసో వై సః. రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి. * అను నుపపత్తును చూతురుగాక. శ్రీకూరత్తాళ్వానుగూడ శ్రీస్తవమున * కీర్తిం దేవి! లిహన్న

హమ్ * అని సాయించియున్నారు. ఇచట కీర్తికి రూపము గలదా? దానిని వీరెట్లు నాకుచున్నారో అని వారి నాక్షేపింతురుగాక. భట్టరుకూడ శ్రీరంగరాజస్తవమున *చూడా చుంబి ముఖాంబుజమ్*అని ముఖమునో తామరనో జుట్టు ముద్దిడునట్లు సాయించియున్నారు. మీరు చెప్పినట్లు వక్త్రిసంయోగముగదా చుంబనము. ముఖమునకుంగూడ ముఖమొకటి గలదా? లేక, తామరకైనను ముఖము గలదా? అని యోచింపుడు. ఇట్లు వారందఱు ప్రయోగించిరి గాన వారినే మొట్టమొదట ఆక్షేపింపవలయును.

౧౨. శ్రీమద్వరవరమునీంద్రగ్రంథమాలోపోద్ఘాతంబున "తత్తు........విషయకస్సన్నేవ సార్థః" అని ముద్రించియున్నట్లు దోషము చెప్పుచున్నారు. అటులే కానిమ్ము. స్వామివారు విశేషణవిశేష్యములొకేలింగమున నుండవలయునను నియమము నెఱుగకయే నూటికి మించిన గ్రంథములను రచించిరని యంతట చాటించుకొనుగాక. ఈ వాక్యమున వాస్తవిక సమాధానమును విద్వాంసులే యెఱుంగుదురు. దోషములను వెదకుటకుగానయినను వీరు స్వామి గ్రంథములను సేవించుచునుండుటచే ధన్యధన్యులని మాటిమాటికి జెప్పెదము. అందు నొకటిరెండు దోషములనే చూపిన వీర్లకు శిశుపాలసామ్యము కూడ దొరకలేదేయని విద్వాంసులు కష్టబడుచున్నారు. "ప్రామాణికానాం ప్రాజ్ఞానామ"ను స్వామివారి శ్లోకమున వృత్తభంగదోషము. "పంచమం లఘు సర్వత్ర" అను

అనుష్టుప్పులక్షణమున పంచమాక్షరమునందు లఘువుండ వలయునని చెప్పియున్నదిగదా! అని యాక్షేపించుచున్నారు. వీరు రఘువంశకుమారసంభవాది రెండుమూడుకావ్యములనయినను చదువలేదు గాబోలు! పంచమాక్షరమును గురువుగా కవులు అనేకులు ప్రయోగించియున్నారే. చూడుడు :— * తదన్వయేశుద్ధిమతి * ఫలానుమేయాః ప్రారంభాః * తతః ప్రతస్థే కౌబేరీమ్ * త్వమేవ హవ్యం హోతాచ *లబ్ధప్రతిష్ఠాః ప్రథమమ్* ఇత్యాదులనేకములు. *ఇదం కవిభ్యః పూర్వేభ్యః అని యుత్తరరామచరిత నాందీ శ్లోకముకూడ. ఆ బాలగోపాలము అందఱునుపఠించు శ్రీ రామాయణసంగ్రహమున మొదటిశ్లోకము *ఆసీదయోధ్యా నగరీ * అని. అమరకోశమునకూడ * స్వరవ్యయం స్వర్గ నాక...* ఇంద్రోమరుత్వాన్మఘవా * యాతుధానః పుణ్య జనః * రాత్రించరో రాత్రిచరః * నభోఽన్తరిక్షం గగనమ్ * బుద్ధిర్మనీషా ధిషణా * ప్రేక్షోపలబ్ధిశ్చిత్సంవిత్ * వల్గువామం హరిశాలి * ఇత్యాదిప్రయోగము లనేకములుండ వానిలో నొకటినైననుజూడక స్వామిశ్లోకమున వృత్తభంగదోషమున్నట్లు ధ్వజమెత్తుట యెంతసాహసము. వీరే ౧౧–వ పుటలో "కర్మ కఃస్వకృతమత్రనభుఙ్క్తే" (ఎవరిచట తాముచేసిన కర్మంబును అనుభవింపకుందురు) అని చెప్పినట్లు చేయుదురుగాక.

౧౩. మితబుద్ధిగలవీరు కేవలమసూయవలననే యీ గ్రంథము రచింపబూనినట్లు ఇంతవఱకు నిరూపితమాయెను. వీరి మొదటిగ్రంథమే స్వామివారి సూక్తులను దూషించుటకుగానే యారంభింపబడియున్నది. ఇంకను క్రమక్రమముగ నభివృద్ధి నందఱు జూడగలరు. పరమసాత్వికులును మహాపండితులునైన వీరితండ్రిగారు ఇట్టివీరిదుష్ప్రవృత్తిని నిషేధింపకుండినందులకు కారణము తెలియలేదు. మహాశ్రద్ధతో శిక్షించిన పినతండ్రియయిన బుచ్చన్నగారు మున్నగువారుకూడ దీనికై శోచించుచునున్నారు. ఇకమీద ప్రధాన విషయములను కొంచము చర్చింతము.

౧౪. ఇట్టి మహాపండితులయిన వీరు మదిరేక్షణ శబ్దార్థమును పరిష్కరింప యత్నించుచున్నారు. శ్రీమాన్ సింహాచలము వైయాకరణశిరోమణి కరి. రామానుజాచార్యుల శ్రీముఖపత్రికను చూడుడు:—

శ్లో॥ "శాస్త్రార్థేషు పరిష్కారాన్ కర్తుం సర్వేఽపి నేశతే। ప్రామాణికైః మహాప్రాజ్ఞైః నానాగ్రంథవిశారదైః॥ కర్తవ్యే సుపరిష్కారే మితజ్ఞానాం ప్రవృత్తయః। పరిహాసాయ కల్పేరన్ తేషాం మౌనం పరం వరమ్॥ మదిరాక్ష్యర్థయాథాత్మ్యే శ్రీకాంచీస్వామిభిర్బుధైః। ప్రణీతాః కృతయస్సర్వాః విదుషామమృతోపమాః॥ సత్యం తా ఏవ సతతం తత్రతత్ర బుధోత్తమాః। సన్తోఽనుభూయ సంతృప్తాః అసూయావ్యాధిదూరగాః॥ తత్తాదృశాన్ మహాభాగాన్ శతశశ్చ సహస్రశః। వీక్ష్య సంమోదమానానాం

ధన్యతాభూయసీధ్రువమ్ ॥ చతసృష్వపి భాషాసు స్వామిపాదైః ముహుర్ముహుః । ప్రకాశ్యమానాః సద్గ్రంథా ఏవ విద్వద్రసాయనమ్ ॥ వృథా తత్ఖండనోద్యుక్తాః ఇతస్తత ఇహేర్ష్యయా । అవజ్ఞామాత్రఫలకాః దూయన్త ఇతి దృశ్యతే॥ అవజ్ఞా నస్పృశేదస్మానితి వ్యర్థాశయా పునః । సంభ్రాన్తేష్వపి సైవాహో సమింధానావలోక్యతే॥ తత్రైవ కేపి చపలాశ్చలభీభవన్తీత్యాచార్యవర్యఫణితే సతతం స్మరన్తః। అజ్ఞాంగరార్యకృతిసంచయదీపదగ్ధానుద్దిశ్య కింను కథయేమ విధిర్బలీయాన్॥'' ఇట్టిపత్రిక లనేకములు గలవు.

౧౫. మదిరేక్షణయనుపదమునకు కల్లుబోలిన నేత్రముగలది యనునర్థమును ఖండించి మదించిన కాటుకపిట్టబోలిన నేత్రముగలది యనునర్థమే న్యాయ్యమని స్వామివారు స్థాపించుచున్నారు. ౪-వ పుటమున వీరు "ప్రసిద్ధార్థమునువిడిచి అప్రసిద్ధార్థమును స్వీకరించుట కేమికారణము''ని అడుగుచున్నారు. ప్రసిద్ధాప్రసిద్ధముల నిట్టిబాలకు తెఱుగరు. కూపకూర్మము (బావిలోనుండు కప్ప)వంటి వీరికి ఏది తెలియలేదో; అది యప్రసిద్ధము, తెలిసినది ప్రసిద్ధము అని దలంచియున్నారుకాబోలు! వీరు భ్రమప్రమాదముల గనియని క్రిందనే నిరూపించియున్నాను. రామతీర్థ సింహాచలాది క్షేత్రముననుండు పండితులందఱును వీరిని అజ్ఞానాన్యథాజ్ఞానరాశియని చెప్పుచున్నారు. ఇట్టివీరు * మదిరో మత్తఖంజనః * అను కోశము ప్రసిద్ధమని యెఱగలేదనిన నేమినష్టము. అనేకగ్రంథములను చక్కగ విమర్శించి

యాత్రితేలిన విద్వాంసులు ప్రామాణికులనేకులు ఎందఱెం దఱు స్వామివారు సాయించిన యర్థమును ఆమోదించుచు న్నారో వీరెఱుఁగరా? ఎఱుఁగరనిన వారిలో కొందఱి పత్రికలనుమాత్ర మిచట ప్రకటింతము.

(౧) చెన్నపట్టణము ప్రెసిడెన్సికాలేజి సంస్కృత పండితులయిన, విద్యాసాగర విద్యాలంకార మహోపా ధ్యాయ శిరోమణి వ్యాసరాజ శాస్త్రిలవారు:— "సత్య ముగ నేను చెప్పుచున్నాఁడను. నేఁడే శ్రీ కాంచీపురము అణ్ణంగరాచార్యస్వాములవారి శ్రీసూక్తిని సేవించుభాగ్యము నాకు చేకూరినది. స్వామివారు నాలుగు భాషలలోను లోకోపకారకములగు గ్రంథములు ఇన్నూటికి నధికముగా రచించియున్నట్లును, ఆనాలుగుభాషలలోను మాసపత్రికలు ప్రకటించుచునున్నట్లువినబడియున్నను, ఇప్పుడేఆసూక్తులను అనుభవించుభాగ్యము దైవవశంబుగ లభించినందులకు ఆనందము వాచామగోచరము.........మదిరేక్షణార్థవిష యమున నామనసున దోఁచినవిషయమును దెల్పెద. ఈ వివాదము మూఁడుసంవత్సరములుగా జరుగుచున్నట్లు ఇప్పుడే వినబడితిని. నాగృహసమీపంబుననున్న నాప్రియమిత్రులు శ్రీవైష్ణవులు కొందఱు మదిరేక్షణార్థవిషయంబున అణ్ణం గరాచార్యులమతంబును అవశ్యముగ ఖండింపవలయునని నన్ను నిర్బంధించిరి. వారలమాటను గౌరవించి నేనావిష యంబును సావధానముగా విమర్శించితిని. పైవిషయమున అణ్ణంగరాచార్యులువ్రాసినఆవ్యాసములు అచ్చయియున్నట్లు

వినబడి వానినంతయు సంపాదించి ఆమూలాగ్రము చదివితిని. ఇట్టివిషయములనుపకరించిన మహానుభావులకు ప్రామాణికులందఱు ధన్యవాదము నర్పింపవలయును. ఈ విషయములకు బదులువ్రాయుతలంపెటులుపుట్టినదో ఆశ్చర్యముగనున్నదే. మదిరపదంబునకు కాటుకపిట్టయనునర్థము నెఱుగనివారు వేఱువిధముగ వ్యాఖ్యానించినట్లు అణ్ణంగరాచార్యులు వ్రాసినవిషయము సరియేయని దృఢమైన నానమ్మకము. ఎల్లప్పుడు లోకోపకారకులయిన నా పరమ మిత్రులగు శ్రీమదణ్ణంగరాచార్యులవ్యాపారములు దిన దినములు వృద్ధియగుచునుండవలయునని కోరుచు నింతటో విరమింతము'' అని.

(౨) మదరాస్ నగరవాసి వైద్యరత్నము పండిత M. దురైస్వామి అయ్యంగార్, A. K. A. C. ఆయుర్వేదభూషణ, ఆయుర్వేదాచార్య అను సుప్రసిద్ధపండితులీవిధముగ వ్రాయుచున్నారు. ''............వైద్యకశబ్దసింధువను వైద్యకోశమున మదిరామదిరశబ్దములకు రెంటికిని కల్లు కాటుకపిట్ట అను రెండర్థములును సప్రమాణముగ నిరూపింపబడియున్నది. సుప్రసిద్ధ మహాపండితులగు కీర్తిశేష శ్రీపట్టప్ప తాతాచార్యులు మున్నగువారుకూడ మదిరేక్షణ శబ్దంబునకు కాటుకపిట్టబోలిన కన్నులుగలది యను నర్థమునే నిరూపించియున్నారు. పండితులందఱు నాయర్థమునే యామోదించుచునున్నారు'' అని.

౧౬. నిష్పక్షపాతులగు పండితులందఱు నీవిధముగ

ప్రకటించుచుండ వీరిరోదనము బావిసమీపంబుననే యుండ దగినది. మదిరాక్షీ మదిరేక్షణాదిపదములకు వ్యాఖ్యానము చేసినవారు ఇద్దఱుముగ్గురు గ్రంథకర్తలే. వారందఱు నొకే యర్థమును వ్రాయలేదు. ఒకరువ్రాసినయర్థమును మఱొకరు ఖండించుచున్నారు. ఒకవేళ వారందఱు నొకేవిధముగ వ్రాసియున్నట్లు చెప్పినను సరే; వారేమి మహర్షులా? మహాచార్యులా? సర్వజ్ఞులా? భ్రమప్రమాదములు లేకుండునట్లు వరమునొందియున్నారా? వారువ్రాసిన యర్థములనన్నింటిని యందఱు నటులే యొప్పుకొనుచున్నారా? సర్వసమ్మతముగ గ్రంథమురచించిన మహాపండితవచనంబులనుగూడ వారిబోలిన మహనీయులు ఖండించుచున్నారు. ఈవిషయమున స్వామివారు అనేకోదాహరణములను జూపియున్నారుగాన నావిషయమును అధికముగ విమర్శింపమానెదము. ఉదాహరణముగ నొకవిషయమునుమాత్రము చూపెదము :—

'కయాధ్వోరపత్యం కాయాధవః' (కయాధువు యొక్క కొమరుడు) అనునర్థమును వివక్షించి తద్ధితవృత్తి నాశ్రయించి ప్రహ్లాదుని కాయాధవుడు అని ప్రయోగింప; రెండు వ్యాఖ్యాకారులు 'కాయే అధవః అప్రియః; శరీరే వీతరాగః. అస్థాద్యోగిశ్రేష్ఠః ప్రహ్లాద ఉచ్యతే' (శరీరంబున నాశలేనివాటు. వీతరాగులు. యోగిశ్రేష్ఠులు ప్రహ్లాదులని భావము) అనిరి. ప్రహ్లాదునితల్లికి కయాధువని పేరను నితిహాసము నెఱుగకయేగదా యిట్లు తప్పుగ వ్యాఖ్యా

నముచేసిరి. ఇట్లు అనేకవిషయములు గలవు. వాని నొక టినిజూడక వ్యాఖ్యాతలుచేసిన యర్థమునగూడ తప్పులుం డునా? అని పలుసారి వ్రాయుటను మార్వాడదేశపుబావి లోనుండి యేడ్చుటకు సమముగా పండితులందఱు దలంచు చున్నారు. శాకుంతలమున * మదిరేక్షణేత్యత్ర "మదిరా-సురా" (మదిర=కల్లు) అని వ్యాఖ్యానించిన వ్యాఖ్యానము అనేకస్థలముల భ్రమప్రమాదములు నిండియుండుట స్పష్ట ము. ఇతడొకడొకడుమాత్రముకాడు. అనేకముగ వ్యాఖ్యా తలందఱు నీరీతిని జెందినవారే. అయినను కొందఱు అభి నివేశముచే 'ఇతర విషయములయందు వారలకు భ్రమ ప్రమాదాదులుండినను మదిరేక్షణార్థవిషయమందుమాత్ర ము అవి లేవ'ని చెప్పుచున్నారు. వారు తమపక్షము చెందిన వారినందఱిని ప్రామాణికులుగాను, ఇతరులను భ్రాంతులు గాను తలంచుచున్నారుగాబోలు. కనుక, వ్యాఖ్యాత లీవిష యమును జెప్పలేదనియో, ఈయర్థము వ్యాఖ్యాతల యభి ప్రాయవిరుద్ధమనియో చెప్పకూడదని తేలినది. దీని నే యొక మహాకవికూడ *పురాణమిత్యేవ న సాధు సర్వం... మూఢః పరప్రత్యయనేయబుద్ధిః* (పాతవియన్నియు సాధు వులని చెప్పకూడదు.........మూఢుడు ఇతరుల వచనం బులనే నమ్మియుండును) అని చెప్పెను.

౧౭. ఒక్కెడ కోశవిశేషముల నెఱగకయు, ఒక్కెడ వ్యాకరణము నెఱగకయు, ఒక్కెడ శ్రుతీతిహాస పురాణము నెఱగకయు, ఒక్కెడ దర్శనమర్యాదల నెఱగ

కయు, ఔచిత్యము నెఱగకయు, ఇట్లు అనేకములు ప్రాచీన గ్రంథములందుకూడ నవీనులగు మన గ్రంథమునందువలె గలవను విషయమున సందేహమెవ్వరికిని లేదు. శఙ్కర భగవత్పాదులు శ్రీమద్రామానుజాచార్యులు మున్నగు అవతారపురుషులనుగూడ వారికి జెందినవారు ఆదరించు చున్నారు, ఇతరులు తిట్టుచున్నారుగదా! ఆమహాచార్యుల గతియే యిట్లుండ సామాన్యకావ్యనాటకాదులవ్యాఖ్యా తలగతి నేమనియెదము? నూరువర్షములకుపూర్వము పుట్టిన వ్యాఖ్యానమని గౌరవములేదు. నేడుపుట్టినదని అగౌరవ మును లేదు, *తదాత్వే నూతనం సర్వం ఆయత్యాంచ పురాతనమ్* (అన్నియు నాయాకాలమున క్రొత్తవి. కాలాం తరమున పాతవి) అని శ్రీదేశికులుకూడ సాయించిరి.

౧౮. ఇక వీరు ప్రతాపరుద్రీయమునుగూడ చదివి యున్నట్లు ప్రకటించుటకై చెప్పియున్న దూషణమును విమర్శింతము:—ప్రతాపరుద్రీయమున దోషప్రకరణమున "ప్రయుక్తమప్రసిద్ధార్థే గూఢార్థం పరికీర్తితం" (అప్ర సిద్ధార్థంబున నొకపదంబును ప్రయోగించిన నది గూఢార్థ మని లక్షణము.) అను నొకదోషముగలదు. కాళిదాసుడు ప్రసిద్ధార్థంబునువీడి అప్రసిద్ధార్థాభిప్రాయంబున మదిరాక్షి పదంబును ప్రయోగించెననినచో గూఢార్థంబనుదోషము సంభవించును అనుచున్నారు. మదిరాక్షీ మదిరలోచనా మున్నగుపదములను కాళిదాసుడే మొట్టమొదట ప్రయో గింపలేదను విషయమును వీరెఱుగుదురా! శ్రీరామాయ

ణమునఁగూడ నీపదము మాటిమాటికి ప్రయోగింపబడియున్నది: వాల్మీకియో ఆదికవి. ఆకాలమున ఏదయిన కావ్యమో నిఘంటువో లేదు. ఈపదమునకు ఏయర్థము ప్రసిద్ధము? ఏది యప్రసిద్ధము? అని వాల్మీకియూ పరిశీలింపవలయును. కాళిదాసాదులే చేయకుండ; వాల్మీకికి ప్రసక్తియే లేదు, కనుక ఈదూషణము నిరర్థకంబని ఎఱుగుదురుగాక.

౧౯. పండితులందఱునిందించు నీయల్పగ్రంథమునకై యింతదూరము ఖండింపనుంకించుట సిగ్గుగనున్నదే. కనుక సంగ్రహముగ సారమయిన కొన్ని విషయములను మాత్రమువ్రాసి విరమింతము. ప్రసిద్ధవ్యాఖ్యాతలకు కోశము తెలియలేదనివ్రాయుట తప్పనుచున్నారు. సుప్రసిద్ధ సూత్రవార్తికాదులనుకూడ సుప్రసిద్ధ వ్యాఖ్యాతలు ఎఱుగలేరని పండితులందఱు నేకముఖముగ చెప్పుచునుండ నీవిషయమునకు ప్రసక్తియేమి? మదిరాక్షీపదమునందువలె * నలినం మలినం వివృణ్వతీ * అను నైషధశ్లోకమున పృషతీపదమునకు మల్లినాథుడు కోశవిశేషంబు నెఱుగకచేసిన వ్యాఖ్యానము తప్పనియు, అంజనశలాక యను నారాయణీయవ్యాఖ్యానమే సంగతమనియు పండితులందఱు చెప్పుచున్నారు గదా! ఇట్లు అనేకములు.

౨౦. మదిరనీలాక్షియనియో మదిరాకృతిలోచనయనియో ప్రసిద్ధప్రయోగమును చూపుమనుచున్నారువీరు. వీరినొకవిషయము నడిగెదము:—మీనాక్షి యని ప్రయోగింపవలసినచోట మీనాకృతిలోచనయను ప్రయోగమును

చూపుమని. కాకయు, మదిరనీలాక్షియను ప్రయోగమును చూపినను, మదిరే నీలేచ అక్షిణీ యస్యాస్సా అను విగ్రహముచే నర్థాంతరము చెప్పవచ్చునని వీరెఱ్ఱుఁగగలరు. అట్టి ప్రయోగమును చూపిననే మీరుచెప్పిన యర్థమును ఒప్పుకొనునట్లు వ్రాయుచున్నారు. వీరు తన్ను మహాపండిత శ్రేష్ఠులుగ తలంచుచున్నారుగాబోలు. వీరు ఒప్పుకొనిన నేమి? నిరాకరించిన నేమి? మహాపండితులందఱు నాదరించు శ్లాఘించు నీయర్థము ఇట్టివారాదరించుటకూడ అగౌరవమే. *మాంసఖండైకభక్ష్యాణాం శునాం ఘృతమరోచకం* అనియు, "అవద్యాయైవ తద్ధి స్యాత్ శునేపాత్ర్యం స్వదేతచేత్" అనియు చెప్పుచున్నారు. "మమ సిద్ధాంతః, మదీయః సిద్ధాంతః" అనియు మాటిమాటికిలిఖించుటచే వీరు పండితగోష్ఠిలో చేరలేదు కైవల్యనిష్ఠులని తెలియుచున్నది. వాస్తవముగ ఇదియే న్యాయ్యము.

౨౧. "మండూకే ఇవ వివేకితాపి కథమ్" (౧౦ పుట) అనుశ్లోకము నుదహరించుచున్నారు. ఈ శ్లోకమున మండూకే అను సప్తమ్యంతపదమున ప్రకృతిభావమే సూత్రముచే వచ్చెనో తెలియలేదు. దీనిచే నపప్రయోగ సామర్థ్యము తనకుమాత్రముగాదు; ఇతరులకుగూడఁగలదని నిరూపించుచున్నారేమో?

౨౨. *మదకలమదిరాక్షీ* అను కాలిదాసప్రయోగంబును (౧౩-పుట) ప్రదర్శించిరి. దీనిచే కాళిదాసుడు ఖంజనార్థంబునందే మదిరార్థంబును ప్రయోగించినట్లు

స్థాపింపబడెను. మదకల యను విశేషణము పక్షులయందే సమరసముగ నన్వయించును. * ఏతస్మిన్ మదకలమల్లికాక్షపక్ష * యనిగదా ఉత్తరరామచరిత ప్రయోగము.

౨౩. మద్యార్థమును స్థాపింపవలయునను సభినివేశముచే వీరు శ్రీరామాయణ వ్యాఖ్యాతలగు గోవిందరాజులను మద్యార్థము నెఱగలేరనియు, రఘువంశ వ్యాఖ్యాతలగు మల్లినాథునికూడ అటులే మద్యార్థమును మఱచిపోయినట్లును తిరస్కరించిరి. పూర్వవ్యాఖ్యాతల తిరస్కారము మొట్టమొదట వీరియందే చేరియున్నదిగదా?

౨౪. అసితేక్షణ యని వర్ణించుచునుండు స్త్రీల నేత్రము స్వాభావికముగనే నలుపనియు కాటుకపెట్టుకొనుట మంగళార్థముననే యనియు స్వామివారు అనేకప్రమాణములచే నిరూపించిరి. వీరో వరాహరక్తమువలె ఎఱ్ఱగనేయుండునని మహాగ్రహంబుతో వ్రాయుచున్నారు. అటులేయుండనిమ్ము. దీనిచే నెవరికినష్టము! శకుంతల కాటుకనిడికొనియుండినపుడే మదిరేక్షణ యను వ్యవహారము నొందియుండునట్లు వీరి యభిప్రాయముగాబోలు. ఈ విషయములను స్వామివారు శిరోమణిశేఖరమున విశదముగ నిరూపించియుండుటచే నింతటితో విరమింతము. ఈ ప్రకరణమున వీరు "పూర్వాచార్యులసూక్తులు స్వగోష్ఠియందే చెల్లదగినవి" అనివ్రాసిరి. స్వాచార్యులనే దూషించువీరు పూర్వాచార్యులను దూషించుట యేమి ఆశ్చర్యము. ఆవశ్యకమే.

౨౫. స్వామివారు మల్లినాథులు గదాధర భట్టా

చార్యులు మున్నగువారిభ్రాన్తిని నిరూపించినది న్యాయ్యమేయని యొప్పుకొనుచున్నారువీరు. (పుట ౨౨). ఇటులేమది రేఫణార్థవిషయంబునకూడ వారలభ్రాన్తిని తెలిపినయెడల న్యాయ్యమేయని యొప్పుకొనవలయునుగదా? ఈఘట్టమున వీరు "భ్రాన్తిని నిరూపించునపుడు స్వామివారు అనవసరమయిన పాఠశోధనము గావించిరి" అని దూషణము వ్రాసిరి. సరియయిన పాఠముదెలియక విపరీతార్థముచెప్పుట భ్రాన్తియేగదా. ఆస్థానమున స్వామివారు పాఠశోధనము గావించిరి. కనుక వీరిమాటలన్నియు భ్రాన్తవచనంబులే.

## ఉ ప సం హా ర ము.

పైవిమే చంపినదానిని సమ్మెటచేకొట్టుట యనవసరమని స్వామివారు రెండుమూడుసార్లు వ్రాసియున్నను, దానిని మఱచి బహుమూరము నాకలము చాలించితిని. పండితమ్మన్యులయిన ఈరఘునాథుని కుగ్రంథవిషయముగ నేదియు వ్రాయుట యనవసరమని పండితులనేకులు చెప్పిరి. ఉపన్యాసకేసరిత్యాది బిరుదభూషితులయిన శ్రీ ఉ. వే. వరంగల్ కోయిల్ రంగాచార్యస్వాములవారు విశిష్య పలుసారులుచెప్పిరి. అయినను పామరులను కొందఱ నేమార్చుచునుండువీరిని ఉపేక్షింపకూడదను డాక్టరు K. రంగాచార్యుల (హైదరాబాదు) నియోగంబును ఇంకను అనేకుల నియోగంబును శిరసావహించి యీ గ్రంథమును రచించితిని. రచించి నానా దేశంబులనుండు అనేకపండితుల కంపితిని. ఆ మహాపండితులందఱును ఈగ్రంథమునుజూచి మహానం

దముతో ప్రశస్తిపత్రికల ననుగ్రహించిరి. వానిలో కొన్ని టిని మాత్రమే ప్రచురించియున్నాము. అచ్చుకు కాగితములు దొరకకుండుటచే ననేకపత్రికలు ప్రకటింపలేకున్నయవి. ఈ యపరాధంబును మన్నింపవలయునని యాయాపండితుల నందఱను ప్రార్థించెద. ఆ పత్రికలుకూడ సమయవిశేషంబున ప్రచురింపబడునని విన్నవించెద.

విశిష్య ఈయొకవిషయంబును జెప్పెద. ఈ రఘునాథుని కుచోద్యములను వజ్రాయుధంబుచేగొట్ట సిద్ధముగ నున్నారు-హైదరాబాదుప్రాంతము వరంగలు విజయనగర విశాఖపట్టణ గోదావరీ కృష్ణాజిల్లావాసులు శ్రీస్వామివారి శిష్యులు స్నేహితులు మున్నగువారు. ఈ రఘునాథునిపితామహులు ఖిలాసహాపురమున వసించుచుండిన గృహస్వామియగు శ్రీమాన్ శ్రీభాష్యం కృష్ణమాచార్యులే వీరందఱలో ముఖ్యులు. ఈపుస్తకము రచించుటకై హార్దముగ నుపకరించిన యీ కృష్ణమాచార్యుల సహాయము వాచామగోచరము. ఈరఘునాథులు శక్తియున్నంతవఱకు ఇష్టప్రకారము ఏదయినను వ్రాయుగాక. విద్వాంసులును మహనీయులును నిందించునట్లు తనకాలంబును గడుపయత్నించిన నటులే చేయుదురుగాక. లేదా తన తండ్రిగారు తాతగారు మున్నగువారిపుణ్యావశంబున మంచిబుద్ధిగల్గివుండుననినమ్మెద.

ఇట్లు, ఉభయభాషాపణ్డిత, ఆయుర్వేదవిశారద

M. వెంకటరామసూరిః,

షేష్కారీ బెలా, (౬౦) హైద్రాబాద్ (దక్షిణ). ౪—౩—౧౯౪౬.

శుభమస్తు.

శ్రీరామతీర్థ సంస్కృత పాఠశాలా
ప్రధాన పండితులైన,
నిడమర్తి గోవిందరాజ భాష్యకారాచార్యులవారు.



రామతీర్థ క్షేత్రవిద్యాశాలాయాం పణ్డితోత్తమః ।
అభినన్దేయురిత్యాశాం రఘునాథో వహన్నిజమ్ ॥

పుస్తకం ప్రేషయామాస తత్ క్షణంవీక్ష్య పణ్డితాః ।
జుగుప్సన్తేస్మసుతరాం తత్పిత్రృభ్యోప్యలేఖితత్ ॥

"బాల్యఏవ భవతాం సుతఏవం భాగ్యహానిమవనౌ ప్రథయన్ స్యామ్ । తాససత్వమభజద్బత! దైవం చక్ర ఈదృశమనుగ్రహమస్మిన్॥" ఇతి.



విజయనగర మహారాజ
సంస్కృత కాలేజీ పండితులైన
పరవస్తు. గోవిందాచార్య స్వాములవారు.



ఫలితేషు రసాలతరుష్వఖిలా లగుడోపలపాతనమాదధతే ।
ఇతి నన్విదమీక్షితమేవ, చిరాద్భవతీహ తథైవ గురుష్వపిచ ॥

అసలేషుతు వన్ధ్యతరుష్వీహకో లగుడాదికమత్తి పతి ప్రసభమ్ ।
ఫలితాన్ హి నిహత్య ఫలానిబహూన్యుపలభ్య ముదందధతే రసికాః ॥

రఘునాథఇహేదృశకర్మ చరన్ స్వయమేవ సకేవలమత్తి ఫలమ్।
సకలానపి భూమిగతాన్విబుధాన్ ఫలమాశయతీతి విశేష ఇదమ్॥

శ్రీమదిత్యాది. వ్యాకరణ శిరోమణి.
వ్యాకరణస్థాపక. ఉభయవేదాన్తాచార్య పణ్డితపరిబృఢ.
S. K. వేఙ్కటరామాచార్య స్వాములవారు, P. O. L.
సీనియర్ వ్యాకరణ ప్రొఫసర్ మహారాజ
సంస్కృత కాలేజ్ విజయనగరమ్ (రిటైర్డు.)

---

పటుకోపరి చన్ద్రహాసపాతః కథమేవ క్రియతే మహాత్మభిః ।
ఇతి కేచన చిన్తయేయురిత్థం ధ్రువమేషాం భవితవ్యతాఽతులా ॥

పటుం నాథపదాబ్జ ఉద్ధృతే కథమాసీన్న ను సాహసే రతిః ।
ఇతి చిన్తయతాం మహాత్మనాం న కథఞ్చిదుత్సుకసమాహితం మనః ॥

[illegible] సాదరం బ్రువే ।
జగదీశ[illegible]భిః కరేప్వపచారే రుచిరాస్తు వాక్యతాప్ ॥

ప్ర[illegible]విధియజ్వార్యవాగ్విత్తతేః పణ్డితతల్లజైః కృపామైః ।
[illegible]ద్వ్యపపిడ సాదరం విపరీతాంశకులు శోచ్యతాం ఋయుః ॥

ఇహ పాఠ్యకరసమాశ్యాయాం గ్రన్థస్సర్వబుధైరనేకైః ।
ఆవాంసపదే భావ్య ఇతి చిన్మి దృఢం ముదా ॥

శ్రీరస్తు.